# జ్వాలాసుందరి

## 1

కాశీ లేచేసరికి ఎనిమిదైంది. ఏప్రిల్ సూర్యుడు బాగా పైకిలేచి తన తీవ్రకిరణాలు కిటికీలోంచి అతని ముఖం మీదకు సూటిగా విసురుతున్నాడు. అతడు చేతులు బారచాపి వెనక్కి కొంచెం విరిగి పెద్దగా ఆవలించేడు సూర్యుణ్ణి మింగే హనుమంతుడివలె.

అలాగే నిలబడి ప్రక్కకు తిరిగి గోడ స్టాండుమీద వాచీచూసి ఆశ్చర్యపోయేడు. అది జీవితంలో 'లేట్‌కమర్'లా ఆరున్నర చూపిస్తూంది. అది బహుశా తొలినాటి సాయంత్రం 6-30 అయివుంటుంది. ఉదయం ఆరున్నరకు దానికందవలసిన బత్తెం అందలేదు. అయినా గుమాస్తావలె వొకపూట వుపవాసంతో పనిచేసి, ఆకలేసి చివరకు కాళ్ళు సాగక ఆగిపోయింది.

తన యెడంచేతిమీది వాచీ చూసుకున్నాడు. వెంటనే పక్కున నవ్వువచ్చింది. దానిలో తొమ్మిదిన్నరైంది. తనలాగే తన వాచీకూడా రాబోయేకాలంలోకి జోరుగా దూకుతూంది.

కాని యీ కాలంలో దాని బ్రతుకు హాస్యాస్పదం అని గుర్తెరగదు. అది కాలసూచి. ఆగనిది. పురోగమన శీలి.

కాశీ గళాసులో నీళ్లు నోట్లో పోసుకు పుక్కిలిస్తూ కిటికీ దగ్గరకు వెళ్ళేడు. ఎదురుగా పెరడు. ఫెళ్ళున యెండ. అతడి నోట్లో బ్రష్ ఆడుతూంది గడియారంలో పెండ్యులమ్‌లా, గాలిలో కొమ్మలా.

ఎదురుగా కొండ కుడి ప్రక్కభాగం, చివర, కరిగిన వెండిలా ధళధళ మెరసిపోతున్నాయి. కొండకీ, తన యింటి ప్రహారీ గోడకీ మధ్యవున్న దిగుడుదారి లోంచి పెరుగు అమ్మే అచ్చమ్మ తలమీద తట్ట, నోట్లో చుట్టతో వయ్యారంగా దిగుతోంది. ఈ రెండు నిదర్శనాలే చాలు అప్పుడే యెనిమిదైంది అని చెప్పడానికి. అంతేకాదు. ఆవుళ్ళో దెబ్బలాట్లకు పేరుపడ్డ గాడు సీతన్న పెంకెరకం మచ్చల ఆవు ఆకులు నములుకుంటూ ఆ సమయాన కొండ యేటవాలుమీద సరిగ్గా ఎనిమిది గంటల దగ్గరుంది. రెండు యంత్రాలు అబద్ధమాడినా కొండ అబద్ధమాడదు, గోవసలే అబద్ధమాడదు.

కాశీ తొందరగా కాలకృత్యాలు తీర్చుకుని కాఫీ పెట్టుకుందికి స్టౌ ముట్టించేడు. 'స్టౌ' హోరు పెడుతూంది. అతడలాగె వెనక్కి రెండడుగులు వేసి చిన్న కుర్చీమీద కూర్చున్నాడు. సిగరెట్టు పొగ చక్రాలుగా పైకిలేచి గది కిటికీవరకూ వెళ్ళి, కిటికీ లోంచి లోపలకు జొరబడే గాలివల్ల వడిగా తిరోగమిస్తూంది.

గది నిశ్శబ్దంగా వుంది. స్టౌ మాత్రం హోరు పెడుతూంది.

'తలక్రిందుగా తపస్సుచేసే మనిషి. అతడి తలలో ఝూంకారం బయలుదేరింది. అది వుడుకుతూన్న మెదడు యొక్క హాహాకారావం. దాని వేడి తిన్నగా గుండెలకు తగులుతూంది. గుండెకరిగి కళపెళ మరుగుతూంది. కొంత ఆవిరిగా మారుతుంది. తమాషాగా వుంది' అత డాలోచిస్తూ సిగరెట్టు పీలుస్తున్నాడు.

తిరిగి కిటికీగుండా దృష్టి పైకిపోనిచ్చేడు. సూర్యుడు ధగధగ మెరుస్తున్నాడని కొండ చెపుతూంది. అప్రయత్నంగా కిటికీవద్దకు వెళ్ళేడు.

తలుపుతీసుకుని వసంత వెనుకనుంచి గదిలో ప్రవేశించింది. ఏమి గది! అడివిలా వుంది. కుర్చీలమీద పుస్తకాలు, ప్యాకెట్లు, బ్రష్‌లు - కళ్ళులేని మెరుపుతీగెలు - దర్జీవాడిరాక కెదురుచూస్తున్న మూర్తులు - ఒక కుర్చీమీద సుమారు పూర్తిచేసినట్లున్న ఒక స్త్రీ బొమ్మ వుంది. వసంత దానిని పైకెత్తి జాగ్రత్తగా పరిశీలించి చిన్నగా నవ్వింది.

ఆమె నవ్వు విని కాశీ వెనక్కితిరిగి చూసేడు. అతడు పంట్లాం మాత్రమే తొడుక్కుని వున్నాడు. ఒంటినిండా వెంట్రుకలు ఆల్పాకా కోటువలె నిగనిగ మెరుస్తున్నాయి. మాసిన గడ్డం. చివర గడియలలో వున్న సిగరెట్టు పీక.

వసంతను చూడగానే కాశీ సిగరెట్టుపీక కిటికీలోంచి అవతలికి విసిరి స్టాండుని వున్న చొక్కాతీసి గబగబ తొడుక్కున్నాడు. వసంత పకపకా నవ్వింది.

'ఏమి టిలా అదార్తుగా వచ్చేవు. నా ఆవటం చూస్తే నీకు నవ్వు రాదా మరి!'



వసంత కుతకుతలాడున్న స్టౌను పంపుచేసింది. 'స్టౌ' హూంకరించింది. చేతి గుడ్డతో నీటి పాత్రమీద మూత కొంచెం యెత్తి చూసింది. ఆవిరి గుప్పుమని పైకి వచ్చింది.

'అబ్బెబ్బే మిమ్మల్ని చూసి నవ్వలేదు. మీ ప్రేయసిని చూస్తే నవ్వొచ్చింది.

'ప్రేయసి' ! ... అన్నాడు కాశీ వంటింటిలోంచి పంచ దార, కాఫీ పొడకు తెస్తూ.

'ఔను ... అదిగో ఆ శూర్పణఖ !'

'ఓహో ! అదా' అన్నాడు కాశీ చిన్నగా నవ్వుతూ...

'ఆ బొమ్మకు ముక్కు బుద్ధిపూర్వకంగానే దిద్దలేదు. ఆమె పూజాసమయంలో హారతి యిస్తూంది. ఆమె కళ్ళు భక్తిపారవశ్యంవల్ల అర్ధనిమీలితాలయ్యాయి. కాని ఆమె ముక్కు ! అది యెలా వుంటేనేం...!'

ఆమె డికాక్షన్ వడబోస్తూ ఆశ్చర్యంగా వింటూంది.

'స్త్రీ సౌందర్యానికి ముక్కు చాలా ప్రధాన మైనది' ... కాశీ.

'అంచేతే అది దిద్దడం మానేసేరా ?' అని ఆమె పకపక నవ్వింది.

'అదికాదు. ఆముక్కు దిద్దడంవల్ల యీామె శరీరగత ఆత్మగత రూపం పూర్తి అవుతుంది. అది కొందరికి నచ్చ వచ్చు. కొందరికి నచ్చకపోవచ్చు. ఇప్పుడాముక్కు స్థూలంగా దాని స్థానంలో లేనందువల్ల, దానిని ఎవరి అభిరుచి ప్రకారం వారు వూహించుకోవచ్చు. అప్పుడు ఆమె భక్తి పరితోషిత మైన సౌందర్యం అందర్నీ సమానంగా ఆకర్షిస్తుంది.'

ఆమె కాఫీ కలుపుతూ శ్రద్ధగా వింటూంది.

'నిజమైన సౌందర్యం మనిషి హృదయంలోవుంది. కాని ఆ అనుభూతి నిద్రాణంగా వుంటుంది. దానిని ప్రకృతిలోని యేదో బాహ్యశక్తి మేలుకొలుపుతుంది. పర్యవసానం ప్రకృతి సుందరాతి సుందరంగా కనుపిస్తుంది.'

వసంత తన్మయంగా వింటూంది. కాని ఆమె మొంకి ఘటం.

'సరే, సరే ముందు కాఫీ సేవించండి...'

కాశీ నెకిలిగా నవ్వి కాఫీ అందుకున్నాడు.

'ఎట్లా వుంది కాఫీ?' వసంత.

'ఓమాదిరిగా వుంది.'

ఆమె యీసడించినట్టు నవ్వింది.

'ఔనులెండి. నేను పెట్టిన కాఫీ యెట్లా బాగుంటుంది. మీరు చెప్పినట్లు సౌందర్యంవలె రుచికూడా హృదయంలోనే వుంటుంది. హృదయానికి నచ్చిన చేతులు కాఫీ పెడితే అప్పుడు బావుంటుంది...'

క్రీమ్ చేసిన పచ్చికలావున్న కాశీ మాసినగడ్డం నవ్వింది. చిమ్నీన గొట్టంతో చిమ్మినట్టు సిగరెట్టుపొగ వసంత మొహం గుప్పేసింది. కుడి చేత్తో కాఫీకప్పు భద్రం చేసుకొని ఎడంచేత్తో పొగచెల్లాచెదురుచేస్తూ 'మీ పుణ్యం వుంటుంది నా మీద సిగరెట్టుపొగ వదలకండి – కాఫీ బాగుండకపోతే అదే పోయింది...'

'మంచిదానివే వసంతా, బాగులేదన్నానా?'

'మరేమన్నారు? ఓమాదిరిగా వుందని చప్పరించేరు...'



కాఫీ కరకర నమలమంటావా ?'

'ఆల్ రైట్, నన్నట్టే వేధించకండి. బాగుంటే తాగండి. లేకుంటే పారబోయండి.' ఆమెకు నిజంగా కోపంవచ్చింది.

అతడికి వసంతప్రవృత్తి బాగా తెలుసు. వసంత పట్టుదల మనిషి. తను చాలా అందకత్తెనని, తనుచేసే ప్రతీపని అద్భుతంగా వుంటుందని ఆమె నమ్మకం. ఇతరులుకూడా అలాగే నమ్మాలని ఆమె కోర్కె. అందుకు వ్యతిరేకంగా ఎవ్వరేమన్నా ఆమెకు యిట్టే కోపంవస్తుంది. కాఫీ ఎలావుందని అడిగినప్పుడు, అద్భుతంగా వుందని అతడు చెప్పాలని ఆమె వుద్దేశం.

'నీకు సరిగ్గా బోధపడలేదు వసంతా. కాఫీ వో మాదిరిగా వుందంటే అది నీ దోషంకాదు. రాత్రి బద్ధకించి ప్రక్క కొట్లోంచి చవకరకం పౌడరు తెచ్చా. అది పౌడరు దోషం' అబద్ధమాడేడు కాశీ ఆమెకు పట్టరాని కోపం వచ్చింది. ముక్కు పీల్చ నారంభించింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు గిరగిరా తిరుగుతున్నాయి. ఏడు పొచ్చేస్తూంది.

'ఇకమీదట నే నెప్పుడూ యిలా కాఫీలో జోక్యం చేసుకోను. మీ ప్రేయసి యెవరో ఆమెను పిల్చి పెట్టించుకోండి. అసలు నేను ప్రొద్దున్నపూట రానేరాను...'

'నా ప్రేయసా? చంపావు. నా ప్రేయసికి ముక్కులేదు. అదిపెడితే యిక కాఫీ తాగినట్టే...'

కన్నీళ్ళతో వసంత కాశీకేసి, ముక్కులేని బొమ్మకేసి గబగబ చూపులుమార్చి పకాల్న నవ్వింది.



'నిజం చెప్పమంటావా వసంతా? కాఫీ అద్భుతంగా వుంది.'

'ఊఁ ఊఁ, అబద్ధాలాడకండి. ఈ నిముషంలో పొంగేస్తారు, మరునిముషంలో కుంగేస్తారు...' ఆమె గుయ్యారంగా గునిసింది.

'లేదు లేదు. నిజంగానే...సరే...'

'సరే కానీండి. ఇవాళ సాయంత్రం పిక్చర్‌కి వెళ్దాం. మీరు మరే కార్యక్రమం పెట్టుకోకండి.'

'ఇవాళా...!'

'ఏం?'

'కృష్ణయ్య కూతురు పుట్టినరోజు యివాళ. వాళ్ళింటికి రమ్మన్నాడు.'

'వెళ్ళక్కరలేదు. కాఫీహోటలు వాడిమాట ముఖ్యమా నా మాట ముఖ్యమా? ఇవాళ మా గురువుగారు ఊరినుంచి వస్తున్నారు. మనం సినిమానుంచి తిరిగివచ్చేసరికి ఆయన జనతాలో వచ్చివుంటారు. గంగావతరణం సెట్టింగు గురించి మీతో మాట్లాడాలన్నారు. తప్పకుండా రావాలి...'

కాశీ వసంతకేసి చూస్తున్నాడు. తప్పకుండా రావాలని ఆమె తల తటపటాయిస్తూంటే నొక్కునొక్కుల శిరోజాలు ఒదులుగా కుడి కణతమీదకు జారి వూగుతున్నాయి. నాట్య సాధకంవల్ల దిట్టపడ్డ ఆమె శరీర సౌష్టవం అతనిని ఆకర్షించింది. ఆమెవేపు తదేకంగా చూస్తున్నాడు. తన ఆకృతిని అతడు స్టడీ చేస్తున్నాడని ఆమె పొంగి గర్వంగా చిరునవ్వు నవ్వుతూ నిలబడింది.

'హల్లో మిస్టర్ కాశీ...!' వీధిలోంచి పిలుపు వినపడింది.

'రావోయ్ మూర్తీ...!' కాశీ కేకేసేడు. మూర్తి గదిలో ప్రవేశించేడు. బొద్దుగా పొట్టిగా వుంటాడు. నవ్వితే బూరెబుగ్గలు పొంగుతాయి. ఉబ్బి నవ్వడం అతనికి అలవాటు. మెడ నరాలు పుటకరిస్తాయి. రెండుపళ్లు పైకి ఔపిస్తాయి.

'మంచివేళకే వచ్చేనే. ఉత్త కాఫీయేనా యేమైనా నాస్తా వుందా!'

'క్షమించాలి. సినిమా ప్రొప్రైటర్లు చెప్పివస్తే యిడ్లీ, దోశా సిద్ధం చేసేవాళ్ళం. అథాత్తుగా వచ్చేరు. కాఫీలుకూడా అయిపోయేయి.' ప్రక్కనుంచి వసంత విసిరింది.

'ఓహోహో. నమస్కారం. చూడలేదు. మీరున్నారా! ఇవాళ నేను చాలా అదృష్టవంతుడిని. ఒక చిత్రలేఖకుడు, ఒక నర్తకి – చక్కని ఉదయం – ఇక యిడ్లీ దోశా మాట అలా వుంచండి. కాఫీకూడా అక్కరలేదు ...'

'రక్షించేరు...!' వసంత.

కాశీ వాళ్ళిద్దరికేసి దీనంగా చూస్తున్నాడు.

'మూర్తీ! యివాళ వసంత చాలా కోపంగా వుంది. ఏం అనకు. నువ్వొస్తే కాఫీ లేకపోవడం యేమిటి. ఇందు...' అంటూ అతడికి ఒక కప్పు కాఫీ యిచ్చేడు. మూర్తి కాఫీ ఒక గుక్కపీల్చి ...

'వసంతాదేవి పెడితే బాగుండక పోవడం యేమిటి' అన్నాడు.

'సంతోషం.' వసంత యీసడించింది.



మూర్తి వెకిలిగా నవ్వేడు.

'కాశీ. నిన్నొక రిక్వెస్టు చెయ్యడానికి వచ్చేను'

'ఏమిటి ?'

'మధ్యాహ్నం మూడు గంటలకోసారి మా యింటికి రావాలి. నీతో సావకాశంగా రెండు మూడు గంటలసేపు మాట్లాడాలి. చాలా అర్జెంటైనపని. సాయంత్రం సీశాండ్స్‌లో భోంచేద్దాం. రెండు భోజనాలు యిప్పుడే బుక్ చేశా...'

'ఏమిటంత అర్జంటుపని ?' వసంత.

'ఆ...అబ్బే... యేంలేదు. of course అంతా మీకు సావకాశంగా చెప్తా...!'

'మీరలా నీళ్ళు నములుతూంటే నాకు జాలేస్తుంది. చెప్పకూడదని సూటిగా యే బిజినెస్ మేన్ చెప్పేడు లెండి. తెలీక అడిగేను క్షమించండి'.

ఆమె కోపంతో మండిపోతూంది. కాని తెచ్చుకోలు జాలి మొహంమీద తాండవిస్తూంది. 'క్షమించండి' అని ఆమె కుడిచెయ్యి సగంజాపి అరచెయ్యి విప్పినప్పుడు కోమలమైన ఆమె వేళ్ళుచూసి కాశీ ముగ్ధుడైపోయేడు.

'కాశీగారూ నే వెడుతున్నా' ... అని గిరుక్కున తిరిగింది.

'వసంతా!' కాశీ పిలిచాడు.

వసంత ఆగి సగం తిరిగింది. కాని యేం చెప్పాలో ఆతనికి తోచలేదు. ఆమెజడ యెడం భుజం మీదుగా ముందుకి దూకి సగంలో కెరటంవలె లేచి ఊరువులవరకూ నల్లత్రాచులా వ్రేళ్ళాడి కాశీని ధిక్కరిస్తూంది.



కృష్ణయ్య రమ్మన్నాడు. వసంతరమ్మంది. ఇప్పుడు మూర్తి రమ్మంటున్నాడు. పదిగంటలు కావస్తోంది. ఆదివారం అయినా ఆఫీసరు పదిగంటలకు ఆఫీసుకు రమ్మన్నాడు.

అరనిముషం ఆగింది వసంత. గిరుక్కునతిరిగి ముందుకు నడిచింది.

# 2

ఆదివారం శెలవరోజు. అతి తీక్ష్ణంగా సూర్యుడు ఐదు బారలు లేచాడు. పదకొండున్నరైంది. కాళీ కడుపులో ఆకలి ప్రమిదలో దీపకళికలా ఓసారి తేజరిల్లి చల్లారింది.

ఆఫీసుకు వెళ్ళే వుద్దేశంతో బైల్దేరేడు. గుమ్మంలో నిలబడి చవక బారు సిగరెట్ పీలుస్తున్నాడు. ఆలోచిస్తున్నాడు.

ఆఖరు సిగరెట్టు చాలా రుచిగా వుంది. చివరకొస్తున్న కొద్దీ రుచి యెక్కువౌతూంది.

చెళ్ళున కాస్తూన్న యెండలో చల్లని నీడలిస్తున్నాయి రోడ్డు కిరువైపులా వున్న చెట్లు. రావిచెట్టుక్రింద పైడితల్లి కిళ్లీల కొట్టు. పేరుకి పైడితల్లి కొట్టుగాని, నిజానికి కొట్టు వ్యవహారాలన్నీ పైడమ్మే చూస్తుంది.

పైడమ్మకు మూడుపదులు నిండొస్తున్నా, తన వయస్సుకు ఏడెనిమిదేళ్ళు చిన్నగా ఔపిస్తుంది. ముగ్గురు మొగుళ్లు మారినా, ఆమె యౌవనం మొదటి పరువంలోనే వున్నట్టుంటుంది. అందుకే పైడితల్లి పల్లెత్తుమాట అనడు. అప్పు

డప్పుడు పైడితల్లి కొట్టుమీద కూచుంటాడు. కొందరు యువ కులు కిళ్లీలు నమిలి సిగరెట్లు పీలుస్తూ డబ్బులివ్వకుండా వెళ్లి పోతారు. 'డబ్బు లేవయ్యా?' అని తనువాళ్ళని అడిగితే 'సరే, పైడమ్మకి తెలుసులే' అని వాళ్లు సమాధానం చెప్పినట్లు వూహించి వూరుకుంటాడు.

పైడమ్మలోని రొమాంటిక్ భాగానికీ ఆత్మభాగానికీ యేమీ సమ్మంధం లేదు. రొమాంటిక్ జీవితంలో పైడమ్మ క్లియోపాట్రావంటిది. కాని ఆత్మలోకంలో ఐదేళ్ళపిల్ల. ఆమెకు కాశీమీద చాలా గౌరవభావం. అతడికి కావలసిన కిల్లీలు, కానీకి రెండు మచ్చుసిగరెట్లు రోజూ తీసుకుంటాడు. ఎప్పుడో యెంతో ముట్టజెపుతాడు. ఇచ్చినది పుచ్చుకుం టుంది. అడిగింది యిస్తుంది. ఇచ్చిన దానికీ పుచ్చుకున్న దానికీ సమ్మంధం లేదు.

ఏ విషయానికైనా కారణమే కావాలి కాబోలు, ధూళి రేగడానికి గాలిలాగ! అంతరాళంలో సుప్తావస్థలో వున్న విశేషాన్ని మేల్కొల్పడానికి యత్కించిత్ కారణం అవసరం. ఆ కారణంగా అట్టడుగున చిన్న పిల్లకెరటంలా లేచిన విషయం అంచులవరకూ విస్తరిల్లి జీవితంపై తీవ్రప్రభావంచూపే మహ త్తర విషయంగా మారుతుంది. కాకుంటే వాల్మీకి మహాకవి యెలా ఔతాడు!

మూడేళ్ల క్రితం ఆవూళ్ళో వొక చిత్రకళా ప్రదర్శనం జరిగింది. కార్యనిర్వాహకులు కాశీకి ఆహ్వానం పంపేరు. తన చిత్రాలు ప్రదర్శనార్థం యిమ్మన్నారు. మామూలు ప్రకారం



కాశ్లీ చిత్రాలు యివ్వలేను. ప్రదర్శనం చూడటానికి వెళ్ళలేను.

నిర్వాహక వర్గ సభ్యులంతా కీర్తికండూతి రోగులు - వాళ్ళకి కళ అంటే యేమిటో తెలీదు. సభలు చేయించాలి. ఎవ్వరికో వొకరికి తమ యిష్టాయిష్టాల ప్రకారం సన్మానం జరగాలి. ఆ కలాపంలో సన్మానితుడి కంటె తమకే యెక్కువ ప్రాముఖ్యం, గౌరవం రావాలి. పట్టుసెల్లాలు ధరించి, సెంట్లు పూసుకొని తాము వేదికలలంకరించాలి. అప్పుడు వీళ్ళ కండూతి తీరుతూ వుంటుంది.

ప్రదర్శనం రావిచెట్టుకు అరఫర్లాంగు దూరాన వున్న పురమందిరంలో జరుగుతుంది. ఆ సాయంత్రం నాలుగు గంటలకు ప్రారంభోత్సవం. ఆహ్వాన సంఘాధ్యక్షుడు కాఫీహోటలు ప్రొప్రైటర్ కృష్ణయ్య. ఉత్సవ ప్రారంభకుడు ఆఫీసుకళ మాత్రమే యెరిగిన ఒక పెద్ద ప్రభుత్వోద్యోగి. కార్యదర్శిని సర్వతంత్ర స్వతంత్ర ప్రవృత్తి గలిగి, సొసైటీలో పేరుపొందిన అమలాదేవి.

అమలాదేవి బెంగాలీ కాదు. తెలుగు స్త్రీ. ఆమె సన్నంగా సళాకులా వుండదు. ఆమె వయస్సు ఇరవై యొకటి దగ్గర ఆగిపోలేదు. ఆమె కళ్ళల్లో యౌవనపు నిగుడు ప్రవేశించడంలేదు.

వయస్సు తన నిర్దాక్షిణ్య లేఖినితో ఆమె నుదుటిమీద నిజ ప్రతిభారేఖలు దిద్దింది. కాలం బరువుగా ఆమెమీద సవారిచేసి ఆమె యౌవన చిహ్నాల్ని కృంగదీసింది. కాని, ఆమె కృత్రిమ పరికరాలద్వారా సౌందర్యదేవత నుపాసిస్తుంది.



ఆహ్వాన సంఘాధ్యక్షుడు కాఫీహోటల్ కృష్ణయ్య, ఆఫీసు కళాభిజ్ఞుడైన ప్రభుత్వోన్నతోద్యోగిని వేదిక అలంకరించమని ప్రార్థించేడు. తెలియని విషయాల్ని తెలిసినట్లు నటించి అమాయకపు ప్రపంచాన్ని మోసగించడమనే కళ మాత్రమే తెలిసిన కళాభిజ్ఞమ్మన్యులంతా ఏవేవో మాట్లాడుతున్నారు.

అమలాదేవి యెవరో వ్రాసిన కార్యదర్శి నివేదిక చూచుకుంటూంది. దూరదూరపు జిల్లాలనుంచి వచ్చిన కళాభిమానులు, కళాకారులు, పౌరులు మొదలైన వాళ్ళతో హాలు కిటకిటలాడుతూంది.

ఇంతలో ప్రేక్షకులలో చిన్న కలవరం బైల్దేరింది. గుసగుస లొకొసనుంచి ఆ కొసకు ప్రాకేయి.

ప్రథమ బహుమతిపొందిన చిత్రం గురించి ఒకమూల తగాయిదా లేచింది. చిత్రకారిణి అమలాదేవి చెల్లెలు జమునా కుమారి. చిత్రం ఊర్వసి అని క్రిందనే వ్రాసివుంది కనక పోల్చుకునే శ్రమలేదు. అరగంట క్రిందట కాఫీహోటల్ కృష్ణయ్య ఆ చిత్రాన్ని పొగుడుతూంటేనే ఆ మూలనుంచి యేవో గుసగుసలు బైలుదేరేయి.

అక్కడ ఓడిపోయిన ముసిలి చిత్రకారుడు వున్నాడు. బట్టతల, తెల్లమీసాలు, మల్లుపంచ, కల్లీలాల్చీ, పళ్ళులేవు. ఆ చిత్రానికి బహుమతి యివ్వడం బహుమతి నిర్ణాయకసంఘం వారి పక్షపాతబుద్ధిని తెలియజేస్తుందని, ఆ చిత్రం అంతా తప్పు అని, అసలా చిత్రం ఆమె వ్రాయలేదని, తనకు అన్యాయం జరిగిందని గింజుకోజొచ్చాడు.



తనకు చిత్రలేఖనంలో ముప్ఫై యేళ్లు ప్రవేశం వుందని, తను ఉత్తమోత్తమం అయిన చిత్రాలు రచించానని, సల్వ దోర్ డాలీ వ్రాసిన చిత్రాలవంటివి రోజుకు రెండు వందలు యెడంచేత్తో గిలికిపారేస్తానని ఆయన పంచుమీసా లూడి పడేలా సవాలు చేస్తున్నాడు.

సభలో అంతటా ముందు చేతులు బైటకు లేచేయి-గొంతులు మిన్నుముట్టేటట్లు అంతకుముందే లేచేయి. సభ బెదిరిపోయిన గుజ్జంలా అదుపుతప్పింది.

జనం యెవరిష్టమొచ్చినట్లు వాళ్ళు వేదికపై కెగబాకి గొంతు బద్దలు చేసుకుంటూ మాట్టాడబోతూంటే, యింకెవరో వారిని దిగలాగ ప్రయత్నిస్తున్నారు.

పోలీసులు రాకతప్పలేదు. ఎట్టకేలాచ్చాకా సభ సద్దుమణిగింది. ఓడిపోయిన సల్వదోర్ డాలీ ముత్తాతగారు అలిగి వెంటనే నిష్క్రమించేరు.

సభ ఆ నిముషాని కానిముషం పల్చబడింది. ఒక అర గంట తిరక్కుండా చాలమంది జనం పురమందిరానికి దిగువగా అరఫర్లాంగు దూరంలో వున్న పైడమ్మ కిల్లీకొట్టు దగ్గర నిర్లక్ష్యంగా వ్రేలాడుతూన్న బొమ్మని తండోపతండాలుగా వచ్చి చూస్తున్నారు.

బొమ్మ వేపొకసారి, బొమ్మ ప్రక్కనున్న పైడమ్మ వేపొకసారి చూసి ముక్కుమీద వేలేసుకుంటున్నారు. ఆమె వేపు చూసినప్పుడు బొమ్మ నిజంగా కదలి నవ్వుతున్నట్టు బొమ్మవేపు చూసినప్పుడు ఆమె నిలకడపొందిన మెరుపు తీగలా రూపొందినట్టు గమనించి ఆశ్చర్య పోతున్నారు.

సతీమణి రేడియో ప్రసంగం చేస్తూంటే రిసీవర్ సెట్ ముందు యీజీచైరులో కూచుని, సిగరెట్ పీలుస్తూ తన్మయం చెందే పెద్దమనిషివలె పైడితల్లి రావిచెట్టు క్రింద నిలబడి అందర్నీ చిరునవ్వుతో చూస్తున్నాడు.

'ఈ బొమ్మ యెవరు వ్రాశారు?' తిరిగి తిరిగి యిదే ప్రశ్న. 'ఈ వూరిలో కలెక్టర్ ఆఫీసులో పనిచేస్తూన్న కాశీనాధరావు గారు.' తిరిగి తిరిగి యిదే జవాబు.

ప్రదర్శన మందిరం మూడురోజులూ తొడతొక్కిడి లేకుండా, విశాలంగా సముద్రపుగాలితో చల్లగా వుంది. పైడమ్మ తన కొట్టుదగ్గర జనం అనవసరంగా మూగుతున్నారని మూడురోజుల తరవాత తన బొమ్మను తిరగేసింది.

ఇది మూడేళ్ళక్రితం సంగతి. అప్పటినుండీ పైడమ్మకు కాశీమీద అత్యంత గౌరవభావం.

కాశీ ఆఫీసుకు వెళ్ళేసరికి పన్నెండైంది. ఆఫీసరు రెండవ సూర్యుడివలె వున్నాడు. భయభక్తులు, వినయం గలిగిన గుమాస్తాలంతా ఆ ఆదివారం మిట్టెండవేళ తలకాయలు సరిగ్గా వ్రేలేసుకొని లోకసంరక్షణార్థం పనిచేస్తున్నారు.

ఆఫీసరు సాధారణంగా ఆదివారం ఆఫీసుకు రాడు. అసలు మామూలు రోజుల్లోకూడా పదకొండుగంటలకు రాడు. మధ్యాహ్నం మూడింటికి వచ్చి సాయంత్రం ఎనిమిదిన్నరకు ఆఫీసు విడిచిపెడతాడు. ప్రజాసేవకులు, ప్రజాక్షేమం హృదయంలోంచి కోరేవారు అయిన వారి పరిజనం ఉదయం పది మొదలు సాయంత్రం ఎనిమిదిన్నర వరకూ మొత్తానికి ఆఫీసు వాసాల రుషిపక్షుల్లా వ్రేళ్ళాడుతూంటారు.



ఇతర గుమాస్తాల సంగతి యిక్కడ అంత ముఖ్యం కాదు, గాని పెద్ద గుమాస్తా సంగతి మాత్రం తప్పక చెప్పాలి.

పెద్ద గుమాస్తా ఆఫీసుకు తన జీవితం అంకితం చేసిన పవిత్రమూర్తి. పరమ భక్తాగ్రేసరుడు. ఆఫీసుకు రాగానే రామకోటి వ్రాస్తాడు. అంతా శ్రీరామచంద్రుడి కృప అని యెలుగెత్తి చాటుతాడు.

అతడు ఆఫీసు జీవితానికీ, పారమార్థిక జీవితానికీ యేమీ సంబంధం పెట్టుకోడు. ఉద్యోగాలు తీయించడానికి హంగు బనాయించడం, ఫైన్లు వేయించడం, చీవాట్లు పెట్టించడం, తోటి గుమాస్తాలను అలోలక్షణా అని ఏడిపించడం, యథాశక్తి లంచాలు పుచ్చుకోవడం యిత్యాది తన జీవితానికి ఓ ప్రక్క దృశ్యం. నిత్య రామస్మరణ, తనవల్లనే మడత పేచీలలో పడిపోయిన గుమాస్తాలకు దిలాసా యివ్వడం, యిత్యాది రెండో ప్రక్క దృశ్యం.

ఓ మాటు ఓ గుమాస్తా కూతురికి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. ఇంట్లో యితరదిక్కు లేదు. క్లోరోమైసిటిన్ కొనడానికి డబ్బు లేకపోతే, పెద్దలెప్పుడో సంపాదించిన ఇత్తడి అండా అమ్మి ఆ మందు కొన్నాడు. ప్రమాద పరిస్థితిగా వున్నందువల్ల రెండు రోజులు శలవుకోసం అర్జీ పెట్టుకుంటే, పరమ భక్తాగ్రేసరుడైన పెద్దగుమాస్తా రికమెండు చెయ్యలేదు.

'చూడు రాజారావు! క్లోరోమైసిటిన్ కొన్నావుకద. ఇకనేం, నువ్వు ఆఫీసు మానుకోవడం యెందుకు. మానవ ప్రయత్నం చెయ్యనేచేశావు. మీద శ్రీరామచంద్రమూర్తి వున్నాడు. అతడిమీద భారంఅంతా పడేసి ఆఫీసుకు ధైర్యంగా

నూరుగజాలమేర నడవగానే యెడంప్రక్క కాఫీహోటల్ ప్రత్యక్షమైంది.

అటు చూసేడు. అయ్యారు టంచన్‌గా కూచుని డబ్బులు లెక్కపెట్టుకుంటున్నాడు. అతడి పోకముడి నిగనిగ లాడు తూంది. తమ్మెట్లలో ఎర్రరాళ్లు తళతళ మెరుస్తున్నాయి. కాశీని చూడగానే అతడు నవ్వేడు. అది ఆహ్వానసూచకం గాదు. అయినా కాశీ లోపలికి నడిచేడు.

బీరువాలో అప్పుడే తయారైన ఉల్లిగారెలున్నాయి. వాటి కమ్మటి వాసన గాలివాటుగా వుండుండి యెగిరొస్తూంది.

కాశీకి హోటల్‌వాడు ఐదు రూపాయలు యివ్వవలసి వుంది. హోటల్ సైన్‌బోర్డును టచ్ చేసిన బాపతు యింకా బాకీ వుండిపోయింది. అయ్యార్ స్వతహాగా డబ్బు యివ్వడానికి చాలా బాధపడతాడు. పెద్ద బాకీలవాళ్ళకు పెద్దనామం పెడ తాడు. చిన్న బాకీలు టిఫిన్ రూపేణా తీసుస్తాడు. అంతేగాని నగదు చెల్లించడు.

కాశీ డబ్బు అడుగుతాడేమో అని అయ్యార్ జంకేడు. అడిగితే లేదంటాడేమో అని కాశీ సంకోచించేడు. అయ్యార్ డబ్బు బాకీ వున్నా, టిఫిన్‌తిన్నా కా బాకీలో చూచుకోమంటే తన దగ్గర ప్రస్తుతం కాసీ లేదని పోల్చేస్తాడని కాశీ మానస పడ్డాడు.

కాశీ మంచినీళ్ళుతాగి తిరుగు ముఖం పట్టేడు. బీరు వాలోవున్న తాజా తాజా వుల్లిగారెలు నోట్లో వూహించు కుంటూ. అయ్యారు చిరునవ్వు నవ్వుతూ తలకాయ తాటి టెంకలా వూపుతూ విసర్జన పాడేడు.



ఆకలి యెక్కువై, నిరాశ యెక్కువై, యెండ ద్విగుణీకృతంగా తోచింది. సైడుకాలవలో వొక వూరకుక్క నీళ్లు కతుకుతూంది: ముక్కువిప్పి రెక్కలల్లార్చి కాకి యింటికప్పు మీద బిత్తరచూపులు చూస్తూంది.

ధగధగ లాడుతూన్న ఆ యెండలో మఱ్ఱిచెట్టు చిక్కటి నీడ అలిసి వడగొట్టిపోయినవాళ్ళని ఆహ్వానిస్తూంది. ఆఫీసుకు వెళ్ళేటప్పుడు కాశీ మఱ్ఱిచెట్టు మార్గం తప్పించుకున్నాడు. కాని, వచ్చేటప్పుడు అప్రయత్నంగా అటే వచ్చేడు.

చెట్టునీడ చేరగానే అగ్నిగుండంలోంచి బైటపడ్డట్టయింది. కిల్లీ దుకాణం తెరిచే వుంది. పైడమ్మ వొకకాలు ముడుచుకొని తల వొంచుకొని కిల్లీలు కడుతూంది.

తిరిగి ధర్మసందేహంలో పడ్డాడు కాశీ. పైడమ్మకు తను బాకీయో, తనకు పైడమ్మ బాకీయో దేవుడికే యెరుక. కాని, యిప్పుడు అరువు తీసుకోవడమా? తన జేబులో చిల్లి కానీ లేనిసమయంలోనే!

'దండాలు బాబయ్యా - దరిశెనాలు లేవు' కాశీ వులిక్కిపడి చూశాడు. కొట్టు బడ్డీ ప్రక్కన పైడి తల్లి. బనీను గామంచాతో నవ్వుతూ దండం పెట్టేడు. పైడమ్మ తల యెత్తిచూచి చిరునవ్వుతో కాశీని ఆహ్వానించింది.

ఉద్యోగంవున్న రోజుల్లో ధైర్యంగా వెళ్ళి ఏమి కావాలో ఆమె దగ్గర తీసుకొనేవాడు. కాని యిప్పుడు ధైర్యం చాలడంలేదు. కాని పైడమ్మ చిరునవ్వు యెప్పటి వలెనే హృదయంలో గులాబీమొగ్గ వికసించినట్టుంది. తన పరిస్థితి

ఆమెకుగాని అతనికిగాని తెలీదు. అతడి మనస్సు వుయ్యాలలా వూగిసలాడుతూంది.

ఎండదెబ్బకు కాలిన యిటుకవలెవున్న అతని ముఖం చూడగానే ఆమె చెయ్యి డ్రింకులవేపు వెళ్ళింది. ఒక సీసా మూత టప్ మంది. అతడు ప్రయత్నంగా గడగడ ఖాళీ చేసేడు - కిల్లీ యిచ్చింది. ఒక పాకెట్ చవకబారు సిగరెట్లు తీసుకున్నాడు. ఒక సిగరెట్ ముట్టించి దమ్ములాగి అక్కడ నిలబడలేక గబగబ అడుగులు వేసేడు.

ఇంటికెళ్ళి తలుపు తియ్యగానే కాళ్ళకు మడిచిన కాగితం తగిలింది. అది సూర్యం వ్రాసినచీటి. సూర్యం వెంటనే రమ్మన్నాడు.

సూర్యం తన చిన్ననాటినుండి స్నేహితుడు, బడిలో సహాధ్యాయుడు. అతడికి తగుమాత్రం ఆస్తి వుంది. చిన్న 'ప్రెస్' ఆఫీసు పెట్టుకున్నాడు. అతడికి కాశీ అంటే చాలా అభిమానం. నిరంతరం రంగులు మార్చే యీ లోకంలో, ఉన్నత పథాలకు అడ్డుదాస్లుమాత్రమే తెరచివున్న యీ కాలంలో, ఇచ్చకాలు, నచ్చిక బుచ్చికలే మనిషి విలువకట్టే తూకం రాళ్ళయిన యీ సమాజంలో, కాశీ పెద్దమనిషిగా మెసులుకోడం కష్టం అని అతనికి తెలుసు. కాని కాశీలోవున్న దుర్బలత్వంకూడా అతడెరుగును.

సూర్యానికి కాశీ పది పదిహేనురోజుల కొకసారి జ్ఞాపకం వస్తూంటాడు. అతడి జ్ఞాపకం కాశీ పరిస్థితికి కొలత మీటరు.

'ఏం కాశీ యెక్కడా ఫికరు లేదు...'



'ఇక అంతా షికరే... ఇవాళే వుద్యోగానికి విడాకు లిచ్చా...'

సూర్యం చిరునవ్వు నవ్వేడు. కాని నిజానికి లోపల దహించుకు పొయ్యేడు.

'ఇదిగో యీ పుస్తకంచూడు' అతనికొక వ్రాతప్రతి యిచ్చేడు. 'దీనికి అట్టమీద బొమ్మ వ్రాయాలి.'

'అలాగే' కాశీ.

'అలాగేకాదు, యిప్పుడు వ్రాయి...'

'ఇప్పుడా...!' కాశీ ఆముదం తాగినవాడిలా మొహం పెట్టేడు.

కాశీ రెక్కపట్టుకుని సూర్యం లోపలికి తీసుకెళ్ళేడు. అరగంటలో కాశీ చిత్రాన్ని పూర్తిచేశాడు. బొమ్మ చూసి సూర్యం మురిసిపోయేడు. కాశీకి పదిహేను రూపాయి లిచ్చేడు.

'కాశీ, నా మాట నమ్ము. ఎప్పటికైనా మద్రాస్‌లో పెద్ద 'ప్రెస్' కొంటా. పెద్దయెత్తున పత్రికలు నడిపిస్తా. వాటికి నువ్వే 'ఆర్ట్ ఎడిటర్'. కాశీ కథ విన్నట్టు వింటున్నాడు.

'నీకెంత జీతం కావాలో యిప్పుడే చెప్పేయ్...'

కాశీ పరాకుగా 'వొక సిగరెట్టుపెట్టె' అన్నాడు. అతనికి అది ప్రస్తుతం కావలసినది. సూర్యం విరగబడి నవ్వి సిగరెట్లకు మనిషిని పంపేడు.

అది నిజంగా సూర్యం కల. కాశీ ఆకాశ జీవితం అంతం చెయ్యాలని, అతని ప్రతిభ లోకానికి చూపాలని కోర్కె. అసలు సూర్యం మంచి సంస్కారి. కాశీవంటి సత్తాగలవా

రెందరో వున్నారని, అలాంటివారలు బైటకు రావాలంటే 'ప్రెస్' ఒక బలవత్తరమైన సాధనం అని అతని నమ్మకం. తన కలలు నిజమయే రోజులకోసం యెదురు చూస్తున్నాడు.

# 3

పగలంతా లోకాన్ని మండబెట్టి సూర్యుడు పండుబారిన మాకులా పడమటి కొండ కవతల జారిపోతున్నాడు. పడమటి కేసి చూస్తూంటే ఆ సవిత్రువికాసానికి హృదయం వుప్పొంగి పోతూంది. ఏ చిత్రకారుడూ అటువంటి అరుణ రాగాన్ని వూహించలేడు. అది పింజలు పింజలై కొన్ని చోట్ల, కిరణాల వలె సూటిగా పొడవుగా కొన్ని చోట్ల, కళ్ళు చెదరి పోయేటట్లు విరాజిల్లుతూంది. అక్కడక్కడ ఉదజని అణువు పగిలి తేప్పట్టే నీలలోహితరాగం వలె పెల్లుబుకుతూంది. పేలిన అగ్నిపర్వతంలా, పగిలిన ప్రణయి హృదయంలా, ఆకలి చిచ్చులా, ఎఱ్ఱఎఱ్ఱగా ముద్దగాపాకుతూంది.

ఆ అరుణిమ చూస్తూంటే కాశీకి మతిపోయింది. అనంతంగావున్న ఆ రుధిరార్ణవానికి వీధిలోని మేడలు గోడలు అడ్డొస్తున్నాయి. వెనుకకునడచినడచి సైడుకాలువ తగిలి ఆగిపోయేడు. వెనక యెత్తైనమేడ. ఎత్తు అరుగులు. ఆమేడ మీద విశాలమైన డాబా వుంది. డాబా యెక్కితే పడమటి దిక్కు పూర్తిగా అగుపిస్తుంది, గబగబ మెట్లెక్కి లోపలి హాలులోకి వెళ్ళేడు. హాలు నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుంది.

రెండు నిముషాల తరవాత హాలులోకి వొక వృద్ధు వచ్చేడు. అతడొక తెల్లని పట్టుధోవతి మోకాళ్ళవరకూ కట్టుకున్నాడు. జందెం మిలమిలా మెరుస్తూంది. అతని తల వెంట్రుకలు తెల్ల పట్టుకుచ్చులా వున్నాయి. భుజములమీద వక్షంమీద చక్రాంకితాలు, నొసట ఊర్ధ్వపుండ్రం ముదలకిస్తున్నాయి. జపానికి వెళ్ళబోతున్నా డల్లేవుంది.

'ఎవరుకావాలి నాయనా?' అతడు చిరునవ్వుతో ప్రశ్నిం చేడు. తెల్లని కట్టుడు పళ్ళల్లో రెండు మూడు బంగారు పళ్ళు జిగేలుమన్నాయి.

కాశీ కొంచెం సిగ్గుపడ్డాడు. కాని సిగ్గుపడితే యెలా. పట్టణంలో, ఊపిరిసలపనీయని సందుగొందుల్లో, ఎత్తైన మేడల యిరుకుల్లో, ఆనాడు పశ్చిమాకాశంమీద విరగపూసిన కుంకపుపంట యెలా అగుపిస్తుంది.

'మీ డాబాపైకి వెళ్ళి పడమటికేసి చూడాలని వుంది.'

ఆ వృద్ధుడుకాబట్టి తీరిపోయింది. ఇంకొకరైతే కాశీని దొంగ అనో, వెఱ్ఱివాడనో, యింకేవడనో భావించేవారు.

'వెళ్ళు నాయనా - అలా వెళ్ళు - నే నెప్పుడూ యీ యింటిలోనే వుంటానుగా. అంచేత నేను డాబామీదకు వెళ్ళ నవసరం లేదు'.

కాశీ చిన్నగా నవ్వి వెళ్ళబోయేడు.

'చూడు నాయనా, నీపేరేవిటి?'

'కాశీ!'

'ఏంపని చేస్తూంటావు?'



'ప్రస్తుతం యేపనీ లేదండీ. కాని అప్పుడప్పుడు బొమ్మలు వ్రాసే సరదా వుంది.'

'ఓహో! అలాగా! సరే సరే ... వెళ్ళిరా. నేను జపంచేసుకుని పావుగంటలో యీ హాలులోకి తిరిగి వస్తా. నువ్విక్కడే వుండు.'

కాశీ డాబామీదకు వెళ్ళేడు. విశాలమైన డాబా. సమున్నతంగా వుండడంవల్ల అన్నివేపులా అడ్డులేకుండా బాగుగా వుంది. పడమటి శోభ చెప్పటానికి వీలు లేకుండావుంది. అతని హృదయం పరవళ్ళు తొక్కుతూంది. విచ్చిన మందార పువ్వును చూసిన పసిపాపవలె ఉబ్బితబ్బిబ్బులయ్యేడు.

కాశీ సాధారణ పరిస్థితులలో నిండుకుండ. మిన్ను విరిగి మీదపడ్డా చలించడు. అతని తత్వాన్ని అర్థం చేసుకోనివాళ్ళు అతడిని బద్ధకస్తుడనుకుంటారు. కాని వొకొక్కప్పు డతనిలో మహోద్రేకం కలుగుతుంది.

అవి శాంతినికేతనంలో విద్యార్థిగా వున్న రోజులు. కాశీ చిత్రలేఖనం పోటీలో పాల్గొంటున్నాడు. అర్థరాత్రి ఒంటిగంటకు తన చిత్రం సుమారు పూర్తిచేసేడు. శిలువ మీద మేకు బందీ అయిన యేసు బొమ్మ. కంటక కిరీటం. శాంతి కాంతులు వెల్లివిరిసే చిరునవ్వు. ఏసు ప్రక్కలో బల్లెంపోటు వుంది. నెత్తురు ధారగా కారుతూంది.

అది వొక పవిత్రాత్మ హృదయం. తెగి పారుతూన్న కరుణారసవాహిని. అది యెటువంటి యెరుపు! సందేహం! ఎంత తల పగులకొట్టుకున్నా కాశీకి ఆలోచన తట్టలేదు. ఎన్ని



సాస్లు యెుసపు రంగు కలిపినా తృప్తి కలుగలేదు. చివరి కొక ఆలోచన స్ఫురించింది. నెత్తురు రంగు నెత్తురుదే. అందులోకీ హృదయానికి సమీపంలోవున్న నెత్తురు రంగు ప్రత్యేకంగా వుంటుందేమో జాలిగుండెగల నేత్రాలకు.

బ్లేడుతో తన హృదయభాగంమీద అరంగుళంమేర కోసుకున్నాడు. చిక్కని రుధిరం చిమ్ముకొచ్చింది. దానిని బ్రష్‌తో తీసి యేసు హృదయ సమీపంలో గాయపడినచోట వ్రాసేడు.

ఆ వేళ ఆకాశంమీద ప్రకృతి చేసిన జ్వాలా నృత్యం చూడగానే అతడికి ఆత్మహత్య చేసికొని మరణించా లనిపించింది. జ్వాలా కేశాలతో, జ్వాలా నయనాలతో, జ్వాలాంబరం ధరించిన ఒక అలౌకిక కళాసుందరి తన్ను పిలు స్తూంది. ఆ పిలుపు తనకు స్పష్టంగా ఉచ్చైశ్స్వరంలో విని పిస్తుంది. అతడు మెడ జాలుమీద ప్రమాదకరంగా వంగాడు. రెండు సెకండ్లలో నిలువునా కూలి పడతాడు.

'ఆగండి' వెనుకనుండి కేక. వెనుదిరిగి చూడగానే అతడికొక అపూర్వదృశ్యం గోచరించింది. నిలుకడగన్న మెరుపుతీగ, ప్రభాతవాయువులుసోకి వికసించిన యెఱ్ఱతామర పూవు, వేటగాని ధనుష్టంకారం విన్న బంగారులేడి, ఉదయా కాశంమీదించి దిగివచ్చిన అరుణరేఖవలెవున్న ఆమె శరీర కాంతుల్ని మీగడవంటి పట్టుచీర కొసరుతూ విరజిమ్ముతూంది. ఆమె భయంతో వణుకుతూన్న చేతులు జాపి 'ఆగండి'అంది. ఆమె చేతులట్లాగే వున్నాయి.

కాశీ వొక్క నిముషం వుక్కిరిబిక్కిరయ్యేడు. మరు నిముషంలో యీ లోకంలో పడ్డాడు. 'పరవాలేద'న్నాడు. ఆమెకూడా కొంచెం తేరుకొని స్థిమితపడింది.

'క్రిందకు రండి'

అతడు గబ గబ మెట్లుదిగేడు. హాలులోకి వెళ్ళేడు. హాలులో విశాలమైన టేబిలుంది. దానిచుట్టూ కుర్చీలున్నాయి. ఒక కుర్చీలో ముసలాయన కూర్చున్నాడు. రెండు కప్పులలో 'టీ' సిద్ధంగా వుంది.

'రావోయ్! కాశీ, కొంచెం టీ పుచ్చుకో.' తిరిగి మందహాసం చేశాడాయన. బంగారు పళ్ళు జిగేలుమన్నాయి.

తనతో యెట్టిదైన పూర్వ పరిచయం లేకపోయినా, యెంతో యెరిగున్నవాడిమల్లె కలివిడిగా మాట్లాడుతూన్న వృద్ధుడి ప్రవృత్తికి కాశీ ఆశ్చర్యపోయాడు. ప్రతి మారూ మాట్లాడే ముందు అతడి చిరునవ్వు ముచ్చటగా వుంది. ఇద్దరూ 'టీ' త్రాగుతున్నారు. ఆకాశం యెట్లా వున్నదని అడిగేడాయన. రమణీయంగా వుందని కాశీ జవాబు చెప్పేడు. 'అనురాగం అంబరమైతే...' అన్న శ్రీశ్రీ గేయం జ్ఞాపకం వచ్చిందన్నాడు.

'అన్నట్టు అనురాగం అంబర' మంటే జ్ఞాపకం వచ్చింది. రవీంద్రనాద్ ఠాకూర్ కూడ బొమ్మలు గీశాడు సుమీ, అయితే రవీంద్రుడు మంచి చిత్రకారు డంటావా?'

'మీ ప్రశ్నకు సూటిగా జవాబివ్వడం కష్టం. కాని నా వుద్దేశం సాధ్యమైనంత స్పష్టంగా చెపుతా. తప్పంటే పెద్దలు క్షమించాలి.'



'అబ్బేబ్బే, చిత్రలేఖనం గూర్చి నాకేం తెలీదుసుమీా! బొమ్మ అందంగా వుంటే చూసి ఆనందించడమే...'

ఇంతలో కాశీ డాబామీద చూసిన అమ్మాయి వొక చిన్న కొండిపళ్ళెంలో చీల్చిన తమలపాకులు వక్కపొడి తెచ్చింది.

ఆమె ఆకులు, వక్క అక్కడపెట్టి వెళిపోబోయింది. ముసలాయన ఆమెను వుండమని సంజ్ఞ చేసేడు.

'ఈమె, మా అమ్మాయి ప్రభ. కూచో అమ్మా. ఇతడు కాశీ. మనవాడే. నాకు చెలికాడు. నీకు గురువవగల డని నమ్మకం' అని కాశీవేపు తిరిగి, మళ్ళీ అన్నాడు. 'ఏమంటావు నిజమైన నెమలిని చూడనైనా చూడకుండా మయూర నృత్యంచేసే నాట్యకారులు పేరు, డబ్బు సంపాయిస్తూన్న యీా రోజులలో ప్రకృతిని ఉపాసించే కళాకారులు అరుదు.'

'నేను రిటైర్ అయేముందు మద్రాసులో పనిచేశా. ఆ రోజులలో ప్రభ కొద్దిగా చిత్రలేఖనం నేర్చుకుంది. అన్నట్టు మా ప్రభ గ్రాడ్యుయేటు. కూచో అమ్మా ప్రభా!' ప్రభ కూచుంది.

ప్రభ చిత్రలేఖనం నేర్చుకున్నది అనగానే, కాశీ శరీరం అంతటా ఒక ఆవేశం జరజర ప్రాకింది. వెంటనే అతడు సమాళించుకొని అభినందనపూర్వకంగా చిరునవ్వు నవ్వేడు.

'అయితే మీారిందాకా నాకు వేసిన ప్రశ్న మీాప్రభకే వెయ్యండి...'

'ఏమిటదీ...ఓహో రవీంద్రుడిచిత్రకళా...?' ఏమమ్మా రవీంద్రుడి చిత్రకళ గూర్చి నీ అభిప్రాయం ఏమిటి ?'



ఆమె చిరునవ్వు నవ్వింది. 'వారిని చెప్పమనండి'.

'లేదు మీరే చెప్పండి' కాశీ.

ఆమె క్షణకాలం చిక్కులోపడింది. తలెత్తింది. ఆమె విశాలనేత్రాలు విప్పారేయి. తీర్చిదిద్దినట్టు విల్లువలె వంగిన కనుబొమ్మలు కొంచెం పైకి లేచేయి. సౌందర్య విహంగం రెక్కలు జాచినట్లు పొడుగాటి కనురెప్పలు విచ్చుకున్నాయి.

'చిత్రలేఖనానికి ఆవేశం అవసరం. విశ్వకవి బొమ్మలు ఆవేశపూరితంగా వుంటాయి.'

'అసలు ఏ కళోపాసనకైనా ఆవేశం కావాలి' కాశీ ఆమెవేపు, ఆమె తండ్రివేపు చురుకుగా చూపులు మార్చి చెపుతున్నాడు.

'అన్ని కళలకు మూలం వాకేశక్తి. ఆ శక్తియొక్క వివిధరూపాలే వివిధ కళలు. తాజ్ మహాల్ శిల్పకళ పండిన పంట. దానిని 'మ్యాజిక్ ఇన్ మారబుల్'అన్నారు. ఒక్కొక్క మహాగాయకుడి పాట వింటూంటే, మన మనోనేత్రానికి కొమ్మ చిగిర్చి, మొగ్గలు తొడిగి, పూవ్వులు పూచి, వికసించి నట్లు గోచరిస్తుంది.

'రవీంద్రుడే చెప్పాడు తన చిత్రలేఖనంగూర్చి. తనలో కొన్ని భావాలు పుడుతూంటాయని. వాటిని సాధ్యమైనంత వరకూ తన కలంద్వారా వ్యక్తపరుస్తాననీ, తన కలానికి గూడా అతీతమైన అనుభూతులను వ్యక్తపరచడానికి వేరే గత్యంతరం లేక చిత్రలేఖనాన్ని కూడా చేపట్టవలసి వచ్చిందని.'



'అతని బొమ్మలు చిత్రలేఖనపు విలువలు తూచే పడికట్టురాళ్ళకు అందకపోవచ్చు కాని వాటిలో ఉద్రేకాల స్వరూపం వుంది.'

'Inspiring గా వుండని కళారచన వ్యర్థం. అందుకే నేటి మన దక్షిణాది సంగీతం జనసామాన్యానికి దూరం అయింది.'

'సంగీత కళలో కళ నశించి సైన్సు, సర్కస్సు మిగి లాయి. రాగాలు రసోత్పత్తి కలుగజెయ్యవు.' కాశీ ఆగి మీా అభిప్రాయం యేమిటన్నట్టు ముసలాయనవేపు చూశాడు. ప్రభ అంగీకరించినట్లు తలపంకించింది.

వాళ్ళలా చాలా విషయాలు ఎనిమిది గంటలవరకు మాట్లాడేరు.

కాశీ వెళతానని లేవబోయేడు.

'నాయనా, యీా పూట మా యింట్లో భోజనానికి వుండిపో' ముసలాయన.

'క్షమించండి. నేనీ పూట భోంచెయ్యను. సాయంత్రం యెవరో స్నేహితులతో కలసి హోటలులో దిట్టంగా టిఫిన్ చేశాన'ని బొంకాడు. ప్రభకూడా యెంత బలవంతం చేసినా, భోజనం చెయ్యనని లేచేడు.

'తరుచు వొస్తూండవోయ్ కాశీ'

అల్లాగేనని కాశీ బయల్దేరేడు. 'చూడు నాయనా! ఇంతసేపు మాట్లాడేవుగాని, నా పేరు తెలుసుకున్నావుకావు. రాఘవేంద్రరావు. మా ప్రభావతి నీ శిష్యురాలు తెలుసా!' కాశీకి యేమనాలో తోచలేదు. నవ్వి వెళ్ళిపోయేడు.



వసంత చిన్నప్పటి నుంచీ సిసింద్రీ వంటిది. ఏవిష యాన్నయినా యిట్టే గ్రహించేశక్తి కలది. ఆపిల్ల అందమైన పచ్చటి ముఖంమీద నల్లటి కోలకళ్ళు గండుమీల్లా మెరుస్తూండేవి. ఆమె శిల్ప సౌందర్యం కాశీకి నిత్యనూతనంగా వుండేది. వసంతకీనాడు, కాశీ దగ్గరున్న చనువు వేరు.

చిన్నప్పుడు కాశీ రాగానే కథ చెప్పమనేది. కాశీకి కథ చెప్పడం రాదు. అతడు చిన్నప్పటి నుండీ 'సీరియస్ లైఫ్' మనిషి; కథ చెప్పకపోతే వసంత వొప్పుకోదు. అంచేత వొక కథ ఆలోచించేవాడు.

'అనగా అనగా వొక అడివిలో వొక పేద్దపన్నెండు తలల నాగేంద్రుడుండేవాడు' అనిచెప్పి ఆనాగేంద్రుడెలావుండేవాడో వర్ణనఆరంభించేవాడు. వర్ణనలు చిన్నపిల్లలకేం నచ్చుతాయి? కథ హృదయరంజకంగా వుండాలి. వర్ణన పదినిముషాలదూరం నడవగానే వసంతకు ఆవులింతలు ఆరంభం అయేవి. ఆవు లిస్తూ వొళ్ళు విరుస్తూ మెల్లిగా కాశీ వొళ్ళోనిద్రపొయ్యేది. కథ ఆరంభంలోనే కంచి కెళ్ళేది.

ఒకొక్కప్పుడు ఆ పిల్లకు కోపంవస్తే కాశీ వీపుమీద పిశగుద్దులు గుద్దేది. కాశీ వాటిని యిప్పటికీ మర్చిపోలేడు. అందుకే కృష్ణయ్య యింటికి వసంత వచ్చి తన గురించి అడిగిం దనగానే కాశీ హడిలిపోయేడు.

'డాక్టర్ రాజూ డాటర్ ఎందుకొచ్చింది మిస్టర్ కాశీ?' కాశీ ఆలోచిస్తున్నాడు. అతడికి సమాధానం చెప్పడానికి వోపికలేదు. ఏదోపనేవుండి వుంటుందని నసిగేడు.



వాళ్ళిద్దరూ డ్రింకులు త్రాగి గ్లాసులు దించేరు. తిరుగుతూన్న యెలక్ట్రిక్ పంకా 'బూమ్' అనే సన్నటిశబ్దం తప్ప గది రెండు నిముషాలు నిశ్శబ్దంగా వుంది. కాశీ మరొక సిగరెట్టు ముట్టించేడు.

'అన్నట్టు నీకు చెప్పడం మర్చిపోయా. We're opening a new hotel' కృష్ణయ్య.

కాశీ దమ్ము పీలుస్తూ, యెక్కడ యెప్పుడు అన్నట్టు కళ్ళు పైకెత్తేడు.

'చూశావూ. కాల్టెక్స్ పెట్రోల్ బంకు పక్క సుబ్రహ్మణ్య విలాస్ వుంది. అది మనం కొనేశాం. దానిని నెలలో ఓపెన్ చేద్దామని మన వుద్దేశం. My wife said, అంథాన్యా, everything new, ప్రతీదాంట్లోనూ వొక novelty వుండాలి – అంది."

కాశీ నోటితో సమాధానం చెప్పడంలేదు. సిగరెట్టు పొగలోంచి అతడి కళ్ళు మాట్లాడుతూన్నట్టు కృష్ణయ్య గ్రహిస్తున్నాడు.

కృష్ణయ్య వస్తుతా గొప్ప ఆశావాది. అతడు జీవితాన్నే వొక వర్తకంగా అర్థం చేసుకున్నాడు. అతడెప్పుడు మాట్లాడినా అమోఘమైన 'sales talk లాగే వుంటుంది.

'Why not we go to my house now? You can dine with me – and my wife. నువ్వూ నా wife మన కొత్త హోటల్ ప్లాన్ గురించి ఆలోచించవచ్చు.

కాశీ యీ ప్రశ్నకు సమాధానం యివ్వలేదు. కాని ప్రశ్న వేసేడు. 'కొత్త హోటలుకు యేంపేరు పెడదామను

కుంటున్నావు ?' కృష్ణయ్య చిరునవ్వుతో సమాధానం యిచ్చాడు. 'I am leaving everything to you—and my wife'. నువ్విక్కడే వుండు. గారేజీకి వెళ్ళి కారు తెస్తా."

కాశీ కడుపులో ఆకలి గంటలా మ్రోగుతూంది. కాని అభిమానం వెనక్కు లాగుతూంది. ఆకలి లేదని, మర్నాడు ఉదయం వచ్చి ఆ విషయం మాట్లాడతానన్నాడు. కాని, కృష్ణయ్య వొప్పుకోలేదు. 'No, you must 'nt say no. I am getting the car. You wait here' అని వెళ్ళాడు.

కృష్ణయ్య కారు నడుపుతున్నాడు. కాశీ పక్కని కూర్చొని సిగరెట్టు పీలుస్తున్నాడు. కారు డాక్టరు రాజు గారింటిముందుకు రాగానే కాశీ అప్రయత్నంగా వాళ్ళ గుమ్మంకేసి చూశాడు. గుమ్మంలో వసంత ఆఖరు చెల్లెల్ని యెత్తుకుని నుంచుంది. ఆమె రెండుకళ్ళూ రైలు దీపాలులా తననే చూస్తున్నాయి. కాశీ మొహం అటుతిప్పుకున్నాడు.

కృష్ణయ్య భార్య అలిమేలు, తెల్లగా వుంటుంది. విశేషమైన అందకత్తె కాకపోయినా అందర్నీ ఆకర్షించే శక్తికలది. కృష్ణయ్య నిస్సందేహంగా మంచి నేర్పరి అయిన వ్యాపారస్తుడే గాని అతడి వ్యాపారం అంత విజయవంతంగా వుండంటే దానికి చాలా వరకూ అలిమేలే కారణం.

అలిమేలు కళ్ళు చిన్నవైనా జీడిగింజల్లా నిగనిగలాడు తూంటాయి. వాటితో ఆమె జోరుగా మాట్లాడగలదు. ఆమె ముందర పళ్ళల్లో వొకపన్ను కొంచెం పైకెక్కింది. కాని అదే వొక ప్రత్యేకాకర్షణ. ఆమె చిరునవ్వు మహాచెడ్డది. వయస్సు

మీాదైన వాళ్ళకు కూడా అత్యాశ కలిగిస్తుంది. ఆమె కొంచెం రకం ముక్కులోని బేసరిలో వొక రవ్వ వుంది. దీపకాంతిలో ఆమె యిటూ అటూ ముఖం త్రిప్పినప్పుడల్లా ఆ రవ్వ చూపరులకళ్ళు మిరుమిట్లు గొల్పుతుంది. ఆమె అందరితోనూ యెప్పుడూ తెనుగే మాట్లాడుతుంది. ఆమె అరవ తెనుగు అతి మెత్తగా, అతి యింపుగా వుండి అప్రయత్నంగా ఆమెమీాద ఒక ఆదరణ, అభిమానం కల్గిస్తోంది.

కృష్ణయ్య యింట్లో అంతా దొరల వ్యవహారంగా వుంటుంది. టేబిలు భోజనం, వాష్ బేసిన్లూ, స్టాండులమీాద వ్రేలాడుతూ యెప్పటికప్పుడు మిలమిల మెరిసే టర్కీతువాళ్లూ.

కృష్ణయ్యకు నాలుగేళ్ళ కూతురుంది. దానికి తండ్రి దగ్గర కొంచెం చనువు. తల్లి దగ్గర అసలే చనువులేదు. దానికి నీళ్ళు పొయ్యడం దగ్గరనుండీ అన్నిసేవలూ 'అప్పడు' అనే ముసిలి బంట్రోతు చేస్తాడు. దానికి అప్పడే తల్లి, తండ్రీ, గురువు. అది యెప్పుడూ వాడి మెడపట్టుకు వేళ్ళాడు తూంటుంది.

కృష్ణయ్య, భార్య, కాశీ కలిసి భోంచేసేరు. కృష్ణయ్య పక్కా వ్యాపారస్తుడు. భోజనమప్పుడు అట్టేకాలం వ్యర్థం చెయ్యడు. వ్యాపారవతుగా గబగబ నాలుగు మెతుకులు నోట్లో వేసుకుంటాడు. ఆ విషయంలో అలిమేలు అతని 'అనుగుం జేడియ'

ఇక మిగిలినవాడు కాశీ. అతడు స్వతహాగా రోజుల తరబడి వుపవాసాలు చెయ్యగలడు. కుంచె తీసేడంటే ఒక్కొక్కప్పుడు నాలుగైదురోజులవరకూ తిండి, నిద్ర మరిచిపోతాడు.



ఒక మనిషినిగాని, వస్తువునుగాని, దృశ్యాన్నిగాని పరిశీలించ డానికి దూరాభారం యిత్యాది యే కష్టాలూ ఆలోచించడు.

భోజనం అయేక వాళ్ళు ముగ్గురూ కూచుని కొత్త హోటల్ గూర్చి చర్చిస్తున్నారు. ఆ చర్చలో కృష్ణయ్య తరుచు యేదో కొంప మునిగిపోయినట్టు నిస్సహాయత తెలిబుచ్చు తూంటే వెంటనే అలిమేలు అతనిని యీసడించేది. 'చాల్లెండి, మీరూరుకోండి – మీకెందు కా గాభరా? కాశీనాథరావు గారున్నారుగా. వారి కప్పుడే అంతా అర్థమైపోయింది చూడండి, మన న్యూహోటల్ యెంత అందంగా వుంటుందో. అని కాశీ వేపు తిరిగి 'ఏమంటారు?' అని కళ్ళతోనే అడిగేది.

'Yes Yes. I Know it........ కాని మిస్టర్ కాశీ, మెయిన్‌హాలు గోడలు– సీలింగు అంతా బ్యూటిఫుల్ కలర్ డిజైనుతో నింపాలి' కృష్ణయ్య.

తను తెరవబోయ్యే కొత్తహోటల్‌కు చెయ్యవలసిన హంగామా చాలావుంది. కృష్ణయ్య కొంతవరకూ విషయాన్ని కాశీకి బోధపరిచాడు ఇంతలో గడియారం తొమ్మిదిన్నర కొట్టింది. కృష్ణయ్య చేతివాచీ చూసుకుని దిగ్గున లేచాడు.

'I am sorry' నా కొక అర్జంటు పనుంది. అప్పుడే అరగంట లేటైంది. మిస్టర్ కాశీ, నన్ను క్షమించాలి. మళ్ళీ కలుద్దాం. ఎప్పుడు?'

కాశీ సిగరెట్టు దమ్ము పీలుస్తూ కనుబొమలు పైకెత్తేడు. అలిమేలు మధ్యలో అందుకుంది.

'కాశీనాథ్‌గారూ, మీా ఫ్రండు యెప్పుడూ యింతే. ఏ పనీ పూర్తిగా చెయ్యరు' అని భర్తవేపు తిరిగింది. 'తమరు



దయ చెయ్యండి మేం మాట్లాడుకుంటాం' కృష్ణయ్య వొక క్షణకాలం భార్యవెంపు తెచ్చికోలు తీవ్రతతో చూచి, వెంటనే చిరునవ్వు నవ్వి 'Alright, Alright, మిస్టర్ కాశీ, నే వెళ్తా...' అని పరుగుతీసేడు.

తన క్రొత్తహోటల్ కింద కాశీ ద్వారా యెంత పని రాబట్టాలో కృష్ణయ్యకు తెలుసు. అతనికన్న యెక్కువగా అలిమేలుకు తెలుసు. ఏదైనా వొక విషయం తనముందు వుంటే దాని ప్రతిరూపాన్ని 'కెమెరా'లా చిన్న సైజులో మెదడులోకి క్షణకాలంలో తీసుకుంటుంది. మరుక్షణంలో దానిని బృహత్ స్వరూపంక్రింద మార్చుకొంటుంది. దానిలో ప్రతి పాంశం దుర్భిణిద్వారా చూసినట్టు స్ఫుటంగా చూస్తుంది. ఆ అతిలోకశక్తి ఆమెకు దేవుడిచ్చేడు.

ఇప్పుడు కాశీచేత సుమారు రెండువేల రూపాయిల పని చేయించాలి., ఇప్పటినుండి అతడిని తన చాకచక్యపు తేనెలో యీగలా ఆకర్షించాలి.

అలిమేలు నిర్విరామంగా మాట్లాడుతూంది. యాస తెనుగులో, అవసరమైనచోట్ల నొక్కులతో వాగుతూంది. మధ్య మధ్య చవకబారు హాస్యం విసరి తను మాత్రమె నవ్వు తూంది. కాశీ నూటికి తొంబైపాళ్లు మాట్టాడకుండా నిదానంగా సిగరెట్టు పీలుస్తూ వింటున్నాడు. మిగిలిన పదిపాళ్ళలో నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు అక్కరలేనిచోట చిరునవ్వులతో, తలతాటింపులతో ఆమెను సంతృప్తి పరుస్తు న్నాడు. మిగిలిన ఒకపాలు 'ఔను, కాదు' లతో కాలక్షేపం చేస్తున్నాడు.

అతడు మరొక సిగరెట్టు తీసేడు. చూడకుండా, టేబిలు మీద అగ్గిపెట్టెకోసం తడుముకొంటున్నాడు. అలిమేలు గబాల్న అగ్గిపెట్టెతీసి పుల్ల వెలిగించి, కాశీకి అందించింది. ఎలక్ట్రిక్ పంకా గాలికి ఆమె పైట జారిపోయింది. కాశీ సిగరెట్టు ముట్టించకుండా అగ్గిపెట్టెకోసం పాంటు జేబులింకా తడుముకొంటున్నాడు. ఈసారి అలిమేలు అగ్గిపెట్టె అతనివేపు విసిరింది. అతడు సిగరెట్టు ముట్టించేడు.

'క్రిందటిమాటు మద్రాస్ వెళ్ళినప్పుడు మా బావ హోటల్ చూశా. ఎంత బాగుందనుకున్నారు కాశీనాథ్‌గారూ! మెయిన్‌హాలు బాల్కనీ మీంచి నాలుగు తట్టులా వున్న గదులలో నిలువుటద్దాలు అగుపిస్తాయి. చాలా చక్కగా వుంది ప్లాన్. అట్లాగే యేదో ఒక కొత్తవిషయం తీసుకు రావాలి', కాశీ అలాగే అని తల ఊపేడు.

'మీరాలోచించండండి. అంతా మీ మీదే వదిలేస్తున్నాం...'

కాశీ ఆవులించేడు.

'మీకు నిద్దరొస్తూంది...' గడియారం ఠంగున పదిన్నర కొట్టింది.

'ఈ సోఫాలో పడుకోండి– తలగడాలు పెట్టుకోండి...' కాశీ సోఫాలో జారగిల్లేడు. 'ఇక నే వెళ్లనా' అని అలిమేలు గుమ్మంవరకూ వెళ్లి తిరిగి చూసి కొంటెగా నవ్వి గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది. ఆ తిరగడంలో ఆమె బరువైన పిరుదులు నాట్యం చేశాయి.



కాశీ లేచి దీపాలు ఆర్పేడు. మూలని టేబిల్ మీద నీలి 'డోమ్' గల బెడ్ లైట్ మాత్రం వెలుగుతూంది. ఆ వెలుతురులో గది సముద్ర గర్భంలా వుంది. తలమీద తిరుగుతూన్న ఎలక్ట్రిక్ పంకా మందంగా నిదానంగా 'బుంయ్ బుంయ్' మంటుంది. కాశీ అలాగే సోఫాలో కాళ్ళు క్రింద పెట్టుకు కూచుని గొలుసుకట్టుగా సిగరెట్లు కాలుస్తూ యేదో మైకంలో వున్నట్టు ఆలోచిస్తున్నాడు.

ఒంటిగంట దాటింది. గుమ్మందగ్గర గాజుల చప్పుడైంది. అలిమేలు గదిలోకి వచ్చి తలుపులు వేసింది. గమగమలాడే సెంటువాసనలు గుబాళిస్తూ నిమ్మళంగా వచ్చి కాశీ పక్క కూచుంది. మీట నొక్కితే స్ప్రింగు తన్నినట్టు కాశీ లేచి పోయేడు. వెంటనే అలిమేలు లేచి అతడి చెయ్యి పట్టుకుంది.

'కాశీనాథ్! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నా. నన్ను కాదనకండి' అని అతి జాలిగా బ్రతిమాలింది. అతడు జవాబు చెప్పలేదు. ఆమెకేసి నిదానంగా చూస్తున్నాడు. ఆ నీలి వెలుగులో కట్టువిడిన అలిమేలు యౌవనం కాశీమీద విరుచుకు పడుతూంది. అతడు సిగరెట్టు పీల్చినప్పుడల్లా ఆమె ముక్కులోని రవ్వ వుదయారుణబింబం అంత పెరిగి ప్రకాశిస్తుంది. కమ్మరి కొలిమితిత్తి నొక్కినప్పుడల్లా పొయ్యిలో అగ్ని ప్రజ్వలించినట్టు ధగధగలాడుతూంది.

కాశీ అంతకు ముందే సగం తెలివిలో వున్నాడు. పైగా సిగరెట్లు ఆదే పనిగా కాలుస్తున్నాడు. అంచేత తల దిమ్ముగా వుంది. ప్రస్తుతపు పరిస్థితిలో అతడు పూర్తిగా అపస్మారావస్థ

కొచ్చేడు. అతడు అలిమేలుకేసి చూపు నిలదొక్కి చూస్తు న్నాడు.

అరుణారుణకాంతులతో నిండిన ఆకాశం. దానిలో భూమ్యాకాశాలు కలిసిన చోటుకు రెండుబారల యెత్తున జ్వాలాంబరం ధరించి; భుజాలమీద బుస్సలుకొట్టే పాము ల్లాగా గాలివాటుగా అటూయిటూ యెగురుతూన్న జ్వాలా కేశాలతో, జ్వాలానయనాలతో, గుండెల్ని దహించే సుందర భయంకర మందహాసంతో, అదే ప్రజ్వాలమూర్తి అగుపించింది. ఆమె మంటల బారువంటి రెండు చేతులూ భళ్లున ముందుకు జాపి, పెనుమంటల కొసల కున్న పిల్లనాలుకలవంటి కోమల మైన వ్రేళ్ళు వంచి కాశీని 'రా' అని ఆహ్వానించింది. కాశీ అత్యాశ్చర్యంతో, అత్యానందముతో, భయంతో గజగజ వణుకుతూ, నవ్వుతూ, కన్నీళ్లతో, యెగిరిపడే హృదయంతో ఆ సుందరికేసి చూస్తున్నాడు.

అలిమేలు కొంచెం కళవళపడినా, కాశీ పడుతూన్న వుద్రేకం అంతా తనకోసమే అనుకొని అతడిని సమీపించి మృదువుగా కౌగలించుకుంది. తక్షణం కాశీ నిలువునా కూలి పోయేడు. అలివేలు కేమీ అర్థం కాలేదు. అతడిని లేపడానికి యెంతో ప్రయత్నించింది. అతడికి వొంటిమీద తెలివి వుంటేగా.



# 5

డాక్టర్ రాజారావుగారిల్లు పెళ్ళివారిల్లులా వుంది. వసంత వారంరోజుల్లో ఆవ్వాళ్ళో రెడ్‌క్రాస్ వుత్సవాల్లో నాట్యం చేస్తుంది. వుత్సవ కార్యనిర్వాహకవర్గంలో డాక్టరొక మెంబరు. గవర్నరుసతి అధ్యక్షపదవి అలంకరించుతుంది. సభలు, సమావేశాలు ప్రదర్శనాల నిమిత్తం శానుపాలు ఆవరణాలో పెద్ద పెండాలు నిర్మించబడుతూంది. రెడ్‌క్రాస్ సంస్థకు సంబంధించిన మహామహులంతా రానున్నారు.

ఈ అవకాశం బ్రహ్మాండమైనది. దీనిని జారవిడవకూడదు. ఈ దెబ్బతో తనపేరు దిగ్దిగంతాలలో మారుమ్రోగాలి. కూతురు నృత్యం చేస్తూంటే, అదిచూచి ప్రజలు, సెంట్లుపూసుకున్న, పట్టుసెల్లాలు ధరించిన, సూట్లు బనాయించిన ప్రజలు మెచ్చుకుంటూంటే, యే తండ్రిగుండె నిముషానికి రెండువందలసార్లు ధడధడ కొట్టుకోదు! శ్వేత గులాబీ-చీరెలు, ఆర్గండీవాయిలు వల్లెవాట్లు, ఎత్తు మడిమెలజోళ్ళు, ఫాన్సీ బ్యాగులు, నెయిల్ పాషులు తన కూతుర్ని అభినందిస్తూంటే యే తండ్రి భుజాలు పొంగి ఆనందపు టుయ్యాలలో వూగిసలాడిపోడు !

తన కూతురుపేరు. దానితో ద్వంద్వ సమాసంలా తనపేరు, ప్రదర్శనశాలలో, 'మైక్'లో, వీధుల్లో, పేపర్లో ప్రతీ చోటా ప్రతిధ్వనిస్తూంటే, అభినందించేవాళ్ళకి ధన్యవాదాలు

చెప్పలేక తను విసికిపోతూంటే......అబ్బబ్బ......వూపిరి తియ్యడానికి సమయం వుంటుందా !

ఈజీచైరులో పడుకుని ఆలోచిస్తున్నాడు డాక్టరు రాజు. డాక్టరుకు గొప్ప వోపిక. అవతల రోగులు, ఇవతల రెడ్ క్రాస్ వాళ్ళు అన్నిటికన్నా ముఖ్యంగా కూతురు నాట్యప్రదర్శనానికి హంగుబణాయించేవాళ్ళు యింకా యింకా వచ్చీపోయీవాళ్ళు అంతా తనని పీక్కుతినేస్తూంటే ఆయన విసుక్కోవడంలేదు. అన్నీ నిభాయించుకొస్తున్నాడు.

అయితే కూతురునాట్యం విషయమై తనంత బాధపడ నవసరం లేదు. ఇంతకీ తనకు ఆపరేషన్ థియేటర్ లో నాట్యం వచ్చుగాని యీ నాట్యంరాదు. దీనికి సంబంధించిన విషయా లన్నీ చూసుకుందికి వసంతగురువుగా రున్నారు. సంగీతం మేకప్ మొదలైన సాంకేతిక విషయాలన్నీ ఘనంగా నిర్వ ర్తించగలవాళ్ళంతా వున్నారు.

సాయంత్రం యేడుగంటలైంది. ఆవేళ డ్రెస్ రిహార్సల్. శాస్త్రి అప్పుడే వసంత మేకప్ పూర్తిచేసి వచ్చాడు. నాట్యా చార్యుడు అతనితో చావడిలో తివాసీమీద కూచుని మాట్లాడు తున్నారు. సంగీతం గురువుగారు వొకమూల చిరుచాపమీద వారిబృందంతో కూచుని సంగీతవిషయం మాట్లాడుతున్నారు. వారి వొడిలోవున్న వీణమీంచి ప్రియుని కలగంటూన్న యువతి కలవరింతలా అప్పుడప్పుడు మెత్తగాహాయిగా నొక్కులు బైటపడుతున్నాయి.

వసంత మేకప్ లో వచ్చింది. ఆమె వొకమూల నేల మీద చతికిలబడి గజ్జెలు కట్టుకుంటూంది.



నడివాకిట్లో యీజీచైరులో కూచుని డాక్టరు రెడ్ క్రాస్ వృత్సవ కార్యకలాపాల కాగితాలు చూసుకుంటున్నాడు. ఆయన వంచినతల యెత్తకుండానే కళ్ళజోడు ఫ్రేముకూ, కను బొమలకూ మధ్యనించి దృష్టి సారించి 'కాశీ! వాళ్లొచ్చే వేళై నట్టుందే' అని తిరిగి తనపని చూసుకోజొచ్చాడు. నాట్యా చార్యులతో మాటల్లో మునిగిపోయిన కాశీ అప్రయత్నంగా కళ్ళెత్తి గడియారంవెంపుచూసి, తిరిగి సంగీతం గురువుగారితో మాటల్లో పడిపోయేడు.

# 6

సాయంకాలం మంద-మందమారుతాలు వీస్తున్నాయి. ఆకాశం నిర్మలంగావుంది. పలురకాల పిట్టలు ఎగురుతూ, మధురకూజితాలు చేస్తున్నాయి.

సంధ్యారాగానికి మెరుస్తూ, చిరుకెరటాలతో తుళ్లింత లాడుతూ, గలగలా ఒక యేరు ప్రవహిస్తూంది. ఆ యేటి వొడ్డున వేణుగోపాలమూర్తి ఆలయంవుంది.

ఆ సంజవెలుగులో, దేవతలు విహరించేవేళ, పూజా సామగ్రి పట్టుకొని, లేతవయసుగల ఒక సుందరాంగి తీగలా కదలి కోవెలలోకి వెడుతూంది.

గర్భాలయంలో పూజచేసి ఆ కోమలి మండపంమీదకు వచ్చింది. మండపంగోడమీద 'రాసక్రీడ' చిత్రం అద్భుతంగా వుంది. గోపికకు, గోపికకు నడుమ కృష్ణుడు, కృష్ణునకు, కృష్ణు

ప్రక్క పదహారువేల స్త్రీహృదయాలను కొల్లగొట్టిన కృష్ణుడు.
ఊహిస్తున్నాడు కాశీ; ఊహాకందనిదాన్ని ఊహిస్తున్నాడు.

ఈ నాటికలో వొక సాంకేతిక దృష్టివుంది. కుడ్య చిత్రంలో వ్యక్తులు చైతన్యం కలిగి క్రిందికి దిగివస్తారు. ఆలోచిస్తున్నాడు కాశీ అనంతంగా వస్తూన్న సిగరెట్టు పొగలోంచి.

ఆ మూలనుంచి వీణ, ఫిడేలు సవతుల్లా ఉండుండి ఒకదానిమీద ఒకటి పోటుమాటలు విసురుకుంటున్నాయి. ఉండుండి వేణువు అగ్గిమీద గుగ్గిలంజల్లుతూంది. అప్పుడప్పుడు మృదంగం పిడికిళ్ళు బిగిస్తూంది.

ఎనిమిది గంటలకు కాశీలేచేడు. వరండామీదకు వెళ్ళేడు. కాగితాలు మడిచి కళ్ళుఎత్తి డాక్టరు తిరిగి ప్రశ్నించేడు 'ఎనిమిదవుతూంది ఇక వాళ్ళొస్తారు కామోసు' కాశీ ఒక కుర్చీమీద కూలబడ్డాడు.

మార్దంగికుడు నాట్యాచార్యుడికి కుడిప్రక్క సర్దుకు కూర్చున్నాడు. గజ్జెలు కట్టుకుని అంతకుముందే సిద్ధంగావున్న వసంత లేచింది.

వసంత పులకించిన వసంతఋతువులా వుంది. నర్తకికి కావలసిన అంగసౌష్టవం తూకం కలిగి ఆమె దివినుండి దిగి వచ్చిన ఊర్వశిలా వుంది.

సరిగా ఎనిమిదికల్లా నృత్యం ఆరంభం అయింది. వసంత నృత్యంచేస్తూంటే వూగిసలాడుతున్నట్టువుంది. వెన్నముద్దవంటి ఆమె శరీరంలోని ప్రత్యంగపు కదలికలో Rythm మూరు మ్రోగుతూంది. జీవితమే లయాన్వితంగా తోస్తూంది.



నృత్యం జోరుగా సాగుతున్న సమయానికి రాఘవేంద్ర రావుగారు, ప్రభ వచ్చేరు. డాక్టరు లేచి దయచేయండి అని వాళ్ళను కుర్చీలలో కూచోబెట్టాడు. రెండురోజుల క్రిందట కాశీ డాక్టరును వాళ్ళింటికి తీసుకెళ్ళి వాళ్ళతో పరిచయం చేయించేడు. అప్పుడే డాక్టరు వాళ్ళని డ్రెస్ రిహార్సల్స్‌కు రమ్మని ఆహ్వానించేరు.

ప్రభ మొదట డాక్టరుకు నమస్కరించి తరవాత కాశీ వెంపు తిరిగి చిరునవ్వుతో అతనిని పలకరించింది. చిరునవ్వు నవ్వినప్పుడు మొలక వజ్రాలవంటి తీరైన ఆమె పలువరస తెల్లని కాంతులు దొండపండువంటి ఆమె క్రింద పెదవిమీద జిగేలుమన్నాయి.

ఎన్నడూ లేనిది వసంత తాళం తప్పింది. నాట్యాచారుడు ఆమె వేపు కొంచెం తీవ్రంగా చూసి 'తాళాం' అని కసిరేడు. ఆమె మరింత తొట్రుపడి ఆగిపోయింది. ఆమె నుదుటిమీద ముత్యాలవలె చెమ్మటచుక్కలు పోసిపోయేయి. నృత్యం కొంచెంసేపు ఆగిపోయింది.

తరువాత మరొక అరగంటకన్నా ఎక్కువ సాధకం చేయ్యలేక పోయింది. ఆ అరగంటలో నాలుగైదుసార్లు తాళం తప్పింది. తనవంట్లో బాగాలేదని బొంకింది. నృత్యసాధకం ఆవేళకి ఆపుచెయ్యబడింది.

తరవాత అంతా కూచుని బాతాఖానీలోకి దిగేరు. డాక్టరు తనకూతుర్నీ, నాట్యాచార్యుడినీ, తదితర హాంగు దార్లనీ రాఘవేంద్రరావుగారికి, ప్రభకు పరిచయం చేసేరు.



'అమ్మా ప్రభా! ఇదే మా అమ్మాయి వసంత. సెకండియర్ చదువుతోంది. వసూ ఈమె రాఘవేంద్రరావుగారి అమ్మాయి ప్రభ! గ్రాడ్యుయేట్! ఆర్టిస్టు!' అని డాక్టరు అమ్మాయి లిద్దరిని పరిచయం చేశాడు. ప్రభ వెన్నెల విరిసినట్టు మందహాసంతో వసంతని పలకరించింది. వసంత పెదవులు నవ్వేయిగాని కళ్ళల్లో యేదో బాధ వూగిసలాడింది. 'ఆర్టిస్ట్' అని తండ్రి అనగానే ఆమె గుండెల్లో అగ్నివంటి అనుభూతి యేదో భగ్గుమంది.

పది నిముషాలపాటు అంతా మామూలు పిచ్చాపాటి చేశారు. రాఘవేంద్రరావుగారు మాట్లాడబోయేముందు ప్రతి మాటూ మందహాసం చెయ్యడం అందర్నీ ఆకర్షించింది. ఆయన పండితుడు. అలంకార శాస్త్రం, భరత శాస్త్రం, తెలిసినవాడు. ఈనాటివరకు బడిలోవున్న నృత్యాల్లో యేమంత పస లేదని ఆయన అభిప్రాయం. అలాగని మడి కట్టుకొని కూర్చునేరకం కాదు. ఆయనా, నాట్యాచార్యుడూ నృత్య విషయం కొంతసేపు చర్చించారు.

'మా చిన్నతనంలో కళావంతులు నృత్యం చేసేవారు. అభినయం వారి సొమ్ము. హస్త ముద్రలు పట్టడంలో వాళ్ళు అపూర్వమైన కౌశలం చూపేవారు. కాలంమారింది. దానితో బాటు అన్నీ మారేయి. పాశ్చాత్య కళల ప్రభావం మనకళల మీాద జోరుగా పడుతూంది. ఇది యుగ సంధి......' అని చిన్న నవ్వు నవ్వి కాశీవేపు చూసి "ఏమంటావు నాయనా—అంతేనా" అన్నారు. కాశీ నవ్వుతూ అన్నాడు 'నవ సమా

జాన్ని గర్భంలో ధరించిన పాత సమాజానికి కాలం మంత్ర సాని' అని వొక పెద్ద ఆర్థిక శాస్త్రవేత్త అన్నాడు.

రాఘవేంద్రరావుగారు పకపకా నవ్వి 'ఎంతగడుసు వాడివయ్యా కాశీ! ఆ మహానుభావుడు విప్లవం మంత్రసాని అంటే నువ్వు దాన్ని మాంచి సుళువుగా కాలం అని సర్దేశావే అదీ గడుసుతనం అంటే'.

ఈ రోజులలో విప్లవ పదానికికూడ అర్థం మారి పోయిందికదా. ఇకమీదట ఫ్రెంచి విప్లవాలు, అమెరికన్ విప్లవాలు, రష్యన్ విప్లవాలు రావు. రక్తపాతం వుండదు. సమాజంలో దురాచారాలు విప్లవాత్మక శాసనాల ద్వారా నిర్మూలించబడతాయి.

రాఘవేంద్రరావుగారు వెనక్కు జారగిలబడి ప్రభవైపు చూసి చిరునవ్వు నవ్వేరు. ప్రభ అన్నది 'కాలం మారు తూన్నట్టే కళా దృష్టికూడా మారుతుంది. సమాజానికి కళా కారుడు భవిష్యత్తును చూపే కన్నువంటివాడు. ప్రతిభా వంతులైన కళా తపస్వుల ద్వారానే ప్రకృతి సౌందర్యాన్ని అర్థం చేసుకోగలం కళ లేకపోతే జీవితం వ్యర్థం'

గడియారం పదిగంటలు కొట్టింది. రాఘవేంద్రరావు గారు ఆవులించి ప్రభవేపు తిరిగి అన్నారు 'అమ్మా యిక మనం వెడదామా?' ప్రభ కాశీవెంపు చూసి చిరునవ్వు నవ్వింది. వసంత దిగ్గున లేచింది. ప్రభలేచి నెమ్మదిగా ఆమె చేతులు పుచ్చుకొని అన్నది 'వసంతా నీ నృత్యం చాలా బాగుంది. ప్రదర్శనం రోజున స్టేజిమీద యింకా బాగుంటుంది'. వసంత బెదురు కళ్ళల్లో ఆమెవెంపు చూసి నీరసంగా నవ్వింది.

మొదట రాఘవేంద్రరావుగారు తరవాత డాక్టరు రాజారావు, ఆ వెనక అక్కడవున్న అందరూ లేచారు. 'వీలైనప్పుడల్లా వచ్చి రిహార్సెల్సు చూడండని డాక్టరన్నాడు రాఘవేంద్రరావుగారు ముసిముసినవ్వు నవ్వేరు. నాట్యాచార్యుడు రావుగారితో అన్నాడు 'మీరు పెద్దలు. మీరు వస్తూండి మాకు సహాయం చెయ్యమని నా ప్రార్థన' రాఘవేంద్రరావుగారు పొడిగా నవ్వేరు. 'నాయనా వయస్సుకు నేను నీకంటె పెద్దవాడినేగాని నృత్యకళలో నీకు సలహాలిచ్చే అంతవాడిని కాను. ఏదో చూసి ఆనందించగలను, అంతే' అన్నారు. ఆయనముందు ఆయన వెనుక ప్రభ బయల్దేరేరు. ఎలక్ట్రిక్ దీపాల కాంతిలో ప్రభ పాదాలు దంతంలా మెరుస్తున్నాయి. ఆమె సహజ మందహాసానికి బుగ్గలు చిన్న గుంటులుపడి ఆమె ముఖ సౌందర్యాన్ని రెట్టిస్తున్నాయి. ఆమె తీగలా కదలివెళ్ళిపోతూంటే కాశీ ఆమె నుండి దృష్టిమర్చలేక పోయేడు. వసంత కాశీకేసి కొనకళ్ళతో చూస్తూ యెదురుగావున్న గదిలోకి మందగమనంతో దారితీసింది. ఆమెకాళ్ళ మువ్వలు సత్యభామ అలిగి యేడ్చినట్లు యీసుగా మ్రోగేయి. వాళ్ళని వీధిలోకి దిగబెట్టేడు డాక్టరు.



# 7

ఆరాత్రి వసంత నిద్రపట్టక చాలా బాధపడింది. ఆవేళ కాశీని తనతో సినిమాకు రమ్మంటే యెందుకు రాలేదో ఆ సాయంత్రం యెనిమిదైన తరువాత హోటలు ప్రొప్రైటరు కారులో యెందుకగుపించాడో కూడ యిప్పుడు తెలిసింది. కాశీ తన నృత్య భంగిమను చిత్రిస్తున్నాడు. అది యెప్పటికీ యెందుకు పూర్తి కావడంలేదో కూడ ఆమెకు తెలిసింది. ఇక ఆ బొమ్మ యెన్నడూ పూర్తిగాదు.

తెల్లవారుఝామున మూడైంది. చంద్రాస్తమయవేళ ఆకాశంమీద యేదో వొకమూలని మాత్రమే వెన్నెల నక్కివుంది. వసంత డాబామీదకు వచ్చింది. డాబాకు వొకప్రక్క యెత్తైన గోడవుంది. ఆ గోడ యెప్పుడూ పదునుగా పాకుడుతో నిండివుంటుంది. అంచేత దానికి వెల్లపట్టదు. ఆ గోడవల్ల డాబామీద ఉండవలసిన కాస్త వెలుతురుకూడ లేదు.

వసంత డాబామీద పచారు చేస్తూంది. డాబామీద ఒకమూలగా యీజీచైరుమీద కాశీ పడుకొన్నాడు. అతడు సహజంగా యేరాత్రీ నిద్రపోడు. అందులోక్కీ ఆరాత్రి అసలే నిద్రపోలేడు. ఆకాశంమీద పడమటకేసి లేతవెన్నెల వెలుగు ఆకాశంమీదే ఆకట్టుకు పోయింది.

తనొకసారి జబల్‌పూర్ నుండి కలకత్తా వెడుతున్నాడు. తోవలో విశాలమైన పచ్చిక బీళ్ళు, దూరంగా కోటలవలె

కొండగుట్టలు, అక్కడక్కడ యేవో జీడిమామిడి తోటల వలె వృక్ష సంపద.

అప్పుడుకూడా తెల్లవారుఝాము మూడైంది. రైలు మందంగా నడిచిపోతూంది. ఎఱ్ఱబారిన చంద్రబింబం చాలా దూరంగా చీకటి ముద్దలావున్న చెట్ల చిగుళ్ళకు తగులుకు పోయి వేళ్ళాడుతూంది. నిర్మలాకాశంమీద నక్షత్రాలు దీప కళికల్లా ప్రకాశిస్తున్నాయి.

ఈలోగా యేమూలనుంచో వొక సుందరమైన లేడి వచ్చింది. ప్రక్క కంపార్టుమెంటులోంచి మూడు నాలుగు టార్చిలైట్లు అటువెంపు ఫోకస్ చెయ్యబడ్డాయి. వెంటనే ఆ లేడి వచ్చిన మూలనుంచే గుంపుగా లేళ్ళు వచ్చేయి. మొదట వచ్చినది మొగలేడి, తరవాత వచ్చినవి దాని జనానా అయి వుంటుంది. అవన్నీ వొక నిముషం పరుగెడుతూన్న రైలు వెంపు తలఎత్తి చూసి, తిరిగి పరుగు లంకించుకుని, ఛంగు ఛంగున దాట్లేసుకుంటూ. చీకటిలో కలిసిపోయేయి. 'బ్లాకౌట్' వల్ల రైల్లో చీకటిగావుంది. సిగరెట్ లైటర్ వెలుతురులో కాశీ తననోట్‌బుక్‌లో నాలుగైదు రేఖలు వ్రాసుకొన్నాడు.

ఈ రాత్రి ఆ రాత్రిలాగే వుంది. వెలుగు చీకట్లు ఒక్కొక్క నక్షత్రం తన కడుపులో అంతులేని వేదనాభరిత మైన చరిత్ర దాచుకుని ఎవరు వింటారా అని యెదురు చూస్తూంది. కాని లేళ్ళగుంపు లేదు. వసంత మాత్రం జుట్టు విడిపోయిన ఆడు లేడిలా పచారుచేస్తూంది. ఆమె హృదయం వేగిపోతూంది. కాని ఆమె తనని గమనించలేదు.

కాశీ, డాక్టరు, నాట్యాచార్యుడు రాత్రి చాలాసేపు మాట్లాడుకొన్నారు. వాళ్ళ బాతాఖానీ పూర్తి అయేసరికి పన్నెండు దాటింది. ఇంటికి వెళ్ళలేక కాశీ మేడహాలులోంచి యీజీచైరు డాబామీదకు తెచ్చి దాంట్లోనే ముడుచుకు పడుకున్నాడు. సిగరెట్లు అదేపనిగా కాల్చి అప్పుడే ఆపేడు.

లేచి వసంతం యెదురుగా నిలబడి అడిగేడు, 'నిద్ర రావడంలేదా ?'

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. రాత్రి చాలాసేపు మేలుకున్నందువల్ల అంతా గాఢనిద్రలో మునిగివున్నారు. వసంత కాశీ కళ్లల్లోకి సూటిగా చూస్తూంది. ఆమె సరిగా అతడంతే పొడవుంటుంది. కాని యిప్పుడు తన కతనిమీదవున్న కోపం వల్ల తను అతనికన్న వొక అడుగు యెక్కువ పొడుగున్నట్టు భావిస్తూంది.

'మొన్న సినిమాకు రమ్మంటే యెందుకొచ్చేరు కారు?' నాగుపాములా బుసకొట్టింది.

'తీరికలేక పోయింది'

'హోటలువాడితో తిరుగుతూంటే తీరిక ఎలా వస్తుంది ! నా బొమ్మ పూర్తియిందా ?'

కాశీ మాట్లాడలేదు. నేరంచేసి దొరికిపోయిన వాడిలా నిలబడిపోయాడు. ఆమె మూతి బిగించి ధీమాగా అంది, 'అందుకు కూడా తీరికలేదు 'కామోసు !'

కాశీ ఆమె బొమ్మ వ్రాస్తున్నాడు. అదివొక నాట్య భంగిమ. ఆరునెలలైనా చిత్రం పూర్తికాలేదు. రెండు నెలల

క్రిందట సగంలో పూర్తిగా ఆగిపోయింది. మొదట్లో ఆమె అతడిని అడపాదడపా తొందరపెట్టేది. కాని విసిగిపోయి యిక ఆ విషయం యెత్తడం మానేసింది.

కాశీ నిజానికి చిత్రం సంగతి మర్చిపోయేడు. ఇలాగే చిత్రాలగూర్చి మర్చిపోయేడు. ఆదిలో హెడ్‌గుమాస్తాకు అందుకే కోపం వచ్చింది. హెడ్‌గుమాస్తా శ్రీ రామ చంద్రుడి పేరుచెప్పి తన తండ్రిగారి చిత్రం వృత్తి పుణ్యానికి కాశీచేత వ్రాయించడానికి విశ్వప్రయత్నం చేశాడు. కాశీ డబ్బు విషయం ఆలోచించలేదుగాని హెడ్‌గుమాస్తా తండ్రి చిత్రం లేకపోతేనేం అని వుపేక్షించేడు. హెడ్ గుమాస్తా అడిగి అడిగి విసిగిపోయేడు. పట్టరానికోపం వచ్చింది. కాని యెన్నడూ కించిత్తైనా కోపం ప్రకటించలేదు. చిరునవ్వులే కురిపించేడు కాశీ బద్ధకంమీాద. కాని ఆ చిరునవ్వులే చితాగ్నిగా మారి వొకనాడు కాశీని భస్మం చేస్తాయని అతడికి తెలుసు.

'ఒక వారంరోజుల్లో నీ చిత్రం పూర్తి అవుతుంది వసంతా' జంకుగా అన్నాడు సిగరెట్టు ముట్టిస్తూ.

గిరుక్కున వెనక్కు తిరిగిపోయింది వసంత. మెల్లిగా నడుస్తూ డాబా జాలుగోడవరకూ వెళ్లి జాలుకు ఆనుకుని నించుంది. కాశీ కూడా ఆమె వెనుక నెమ్మదిగా వెళ్ళేడు. ఈపాటికి ఆమెకోపం అవరోహణలో పడి కొంచెం దుఃఖంగా మారి వుంటుందనుకుని ధైర్యపడ్డాడు.

'నిజం వసంతా, నామాటనమ్ము. వారంరోజుల్లో నీ చిత్రం సిద్ధం అవుతుంది. రెడ్ క్రాస్ ప్రదర్శనంలో నీ



నాట్యంకన్నా ముందే నీ చిత్రం తయారౌతుంది. మరి విచారించకు...' అతడు బతిమాలేడు.

ఆమె చట్టున తిరిగి జాలుకు ఆనుకు నించుంది. ఆమె కళ్ళల్లో నీళ్లు గిరగిర తిరుగుతున్నాయి, 'నిజం చెప్పండి, మీ మనసంతా ప్రభ కెంపు వెళ్ళిపోయింది కదూ...'

సూటిగా ఆమె వేసిన యీ ప్రశ్నని యెదుర్కొందికి అతడు సిద్ధంగా లేడు. కొంచెం గాభరాపడ్డా, వెటకారంగా నవ్వేడు.

'నవ్వుతాలుకాదు. నేను కనిపెడుతున్నా వాళ్ళతో పరిచయం కలిగిన దగ్గరనుండీ మీకు ప్రపంచంలో మరేమీ కనుపించటంలేదు. ఇదిగో, నేనిప్పుడే చేప్పేస్తున్నా మీరు ప్రభ యింటికి వెళ్ళడానికి వీల్లేదు. ఆమెతో మాట్లాడటానికి వీల్లేదు...' తల వంచుకుని బుంగమూతితో అంది. కాశీకి విచారం, నవ్వు కలిగేయి. కోపంతో, యీర్ష్యతో ఆమె హృదయం మండిపోతూందని గ్రహించేడు.

'వసంతా, యిలాంటి చిలిపి చిలిపి వుద్దేశాలతో యెందుకు బాధపడతావు? రేపు నీ నాట్యానికి యెలాంటి సెట్టింగులు తయారుచేస్తున్నానో తెలుసా? చూసినవాళ్ళు యిది స్టేజా స్క్రీనా అని ఆశ్చర్యపోవాలి. నువ్వింకా చిన్న దానివి. ఇప్పటినుండీ యిలాంటి వుద్దేశాలు పెట్టుకోకు. కళారాధనకు విశాలహృదయం కావాలి. కళ అడ్డంలేని ఆకాశం వంటిది. కళారాధకుడు దానిలో స్వేచ్ఛావిహారం చేస్తాడు...!

వసంత మరీ బిగుసుకు పోయింది. ఆమె ముఖం కంద గడ్డలా అయింది. మీరు నాకు నీతులు బోధపరచనక్కర్లేదు.

ఆమెతో మాట్లాడటం మానేస్తారా మానరా? ఒకమాట చెప్పెయ్యండి...

'దానివల్ల నీకేం ప్రయోజనం...?'

'ప్రయోజనమో అప్రయోజనమో, ఆ వూసు మీకెందుకూ? ఆమె స్నేహం వొదులుకొంటారా, నా స్నేహం వొదులుకుంటారా...'

అతడేం మాట్లాడలేదు. తిరిగి ఒక సిగరెట్టు ముట్టించి కొంచెం దూరంగా జరిగి గోడనానుకొని అటుచూస్తున్నాడు.

'జవాబు చెప్పరా...?'

అతమూరుకొన్నాడు.

'సరేసరే, యిదే జ్ఞాపకం వుంచుకోండి. మీరే సెట్టింగులు తయారుచేస్తే నేను డాన్సుచేస్తే నాపేరు వసంత కాదు...' వసంత హృదయంలో రోషంతో, కళ్ళలో నీళ్ళతో చరచరా వెళ్ళిపోయింది.

కాశీ ఆలోచనలో పడ్డాడు. తనామెను చిన్నతనం నుంచీ యెరుగును. ఆమె చిన్నప్పుడు గుడ్డిన పీళగుద్దులింకా స్మృతిపథంలో గుబేలుమంటున్నాయి ఆమె పసితనం, బాల్యం, బాలికావస్థ నుండి యౌవ్వనం పొందడం తన కళ్ళముందు జరిగాయి. భగవంతుడు తన కళ్ళద్వారా ఆమెలోని మార్పులను పర్యవేక్షించి పెంపొందించినట్లు అనుభూతి పొందుతున్నాడు. ఆమె వొకమాదిరిగా తాను మలిచిన సుందర విగ్రహం. కాని బ్రహ్మదేవుడు చేసిన సాహసం తాను చెయ్యలేడు. ఆమెపై తనకు అత్యంత అభిమానం వుంది. కాని తనకామె యెన్నడూ ప్రేయసి కాలేదు.



# 8

మూడు రోజులై రిహార్సెల్స్ అవుతున్నాయి. ప్రతీ రోజూ ప్రభ సాయంత్రం యెనిమిది గంటల నుండి రాత్రి పది వరకూ డాక్టరు యింటివద్దే వుంటూంది. రావుగారు కూడా అప్పుడప్పు డొస్తున్నారు. ఆయన, నాట్యాచార్యుడు సాధారణంగా నాట్య సంబంధమైన విషయాలు, ప్రత్యేకంగా రిహార్సెల్సు విషయాలు మాట్లాడుకుంటున్నారు.

చావడి కెదురుగావున్న పెద్ద గదిలో కాశీ తన సహాయకులతో రంగులూ, కుంచలూ, రంగు కాగితాలు, యింకా యేవేవో వింత స్టూడియో సామగ్రి మధ్య మునిగి తేలుతున్నాడు. ప్రభకూడా అతని తోటే వుంటూంది.

మొదట్లో అతని సిగరెట్టు పొగ ఆమెను చాలా బాధపెట్టింది. కనీసం విలువైన సిగరెట్టు పొగైతే అంత యిబ్బంది పడేదికాదు. కాని అతడు కాల్చేవి కానీకి రెండు మచ్చు. వాటిపొగ గొంతులోంచి లోన ప్రవేశించి ఆమె పేగులు తోడేస్తూంది. కాని అతడి నోట్లో సిగరెట్టుంటేనే బుఱ్ఱ, చేతులు పనిచేస్తాయి. అంచేత ఆ పొగని భరించడానికే నిశ్చయించింది.

వసంత చావడిలో నాట్యం చేస్తూందన్న మాటేగాని ఆమె కళ్లు స్టూడియో గది వెంపే వున్నాయి. గది కిటికీ ద్వారా యెదురు గోడ కౌపిస్తూంది. లోపలవున్న వాళ్లనీడలు

వచ్చేయ్. బోధపడింది కదూ. రేపూ, యెల్లుండీ శలవు అసలే లాభం లేదు. ముఖ్యమైన రిటర్న్సు పెళ్ళాలి. ఫరవా లేదు. అమ్మాయికి, కులాసాగానే వుంటుంది...' అంటూ శలవు కాగితం చింపివేశాడు.

అయితే క్లోరోమైసిటిన్ పని చేయలేదు కామోసు రాజారావు కూతురు చనిపోయింది. ఆ సమయానికి రాజారావు ఆఫీసులోనే వున్నాడనుకోండి. కాని పెద్ద గుమాస్తా అతనికి గొప్ప దిలాసా యిచ్చేడు.

'మీా అమ్మాయి శ్రీరామచంద్రుడిలో మమైకం చెందింది. ధన్యురాలు, శ్రీరామ శ్రీరామ శ్రీరామ.'

అట్లాంటి పరమ భక్తాగ్రేసరుడైన పెద్ద గుమాస్తా తన చేతికింద పనిచేసే గుమాస్తా మందను మూడు జట్లుగా భాగించేడు. ఒకటి 'మన వాళ్ళు.' రెండు 'వాళ్ళని అలావుండనీ'. వాళ్ళు. మూడు 'వాళ్ల మీాద ఒకకన్ను వుంచాలి' వాళ్ళు. మొదటి జట్టులో యెవరితో నైనా ప్రవర్తించవలసి నప్పుడు కళ్ళు చింతనిప్పుల్లా చేసి కఠినంగా మాట్లాడుతాడు. అది నటన. రెండో జట్టు వాళ్ళతో ఓమాదిరిగా మాట్లాడుతూ, చెయ్యవలసిన హానిచేసేస్తాడు శ్రీరామచంద్రుడి పేరు చెప్పి. మూడో జట్టు వాళ్ళతో తేనెలా మాట్లాడుతాడు గుండెల్లో విషం క్రక్కే క్రూరసర్పాలలా.

కాశీ మూడో జట్టులోవాడు. కాశీని చూడగానే పెద్ద గుమాస్తా సాభిమానంగా మందహాసం చేసేడు. కాశీ తన సీటులో కూచోబోతున్నాడు.

2

'మిస్టర్ కాశీ, ఇందాకా నిన్నెందుకో ఆఫీసరుగారు పిల్చేరోయ్. వెళ్ళి ఓసారి కనుక్కో.'

ఆ గొంతులో యెంత మార్దవం! ఆ చిరునవ్వులో యెంత అభిమానం.

ఆఫీసరు యెందుకు పిల్చేడో కాశీకి తెలుసు. అతడు ఆఫీసరు గదిలోకి వెళ్ళేడు. ఐదు నిముషాల్లో తిరిగి వచ్చేడు. అరనిముషంలో రాజీనామా కాగితం పెద్దగుమాస్తాకు యిచ్చి గుడ్ బై చెప్పేడు.

'మిస్టర్ కాశీ! నువ్వు తొందరపడి పోతున్నావు . . . నేను వెళ్ళి చెప్తా ఆఫీసరుగారితో. . .తీసుకో యీ కాగితం...'

'క్షమించండి. ఏం తొందరపడ లేదు. చాలా ఆలస్యం చేశా. మీ రిన్నాళ్ళూ నన్ను దయగా చూసినందుకు చాలా కృతజ్ఞుడిని. ఈవాళతో యీ టెంపరరీ ఉద్యోగానికీ నాకూ సరి...'

అతడు గిరుక్కున తిరిగి నడిచేడు. హెడ్ గుమాస్తా శ్రీరామ శ్రీరామ అనుకుంటూ అతడి రిజిగ్నేషన్ కాగితం డ్రాయరులో పెట్టేడు.

ఆదివారం మిట్టమధ్యాహ్నం మండుటెండలో ఆఫీసు గోడల దగ్గర శెలవు పుచ్చుకుని గుమ్మం దిగేడు కాశీ. చమ్మట చుక్కలు పోసిపోయిన అతని ముఖంమీద సముద్రంమీంచి వచ్చిన చల్లగాలి సోకి, ఆఫీసు బంధంనుండి విముక్తిపొందిన జీవాత్మకు సుస్వాగతం చెప్పింది.

ఆకలేస్తోంది. చేతిలో కానీ లేదు. కనీసం ఆకలి మరచి పోడానికి ఒక్క సిగరెట్టయినా లేదు. ఇంటివేపు నడుస్తున్నాడు.



# 4

రాఘవేంద్రరావుగారి గుమ్మం దిగుతూనే శాస్త్రీ సిగరెట్టు వెలిగించాడు. వెలిగించినట్లు మరిచిపోయి, దమ్ములు లాగుతూన్నట్టు గుర్తులేక యెలట్రీ దీపాల కాంతిలో మెయిన్ రోడ్డు మీాంచి వెళిపోతున్నాడు. తన యెడం పక్కనుంచీ రెండు చేతులు వెనకకునడిచి వెళిపోయేయి. అదేసమయంలో తనకుడిపక్క నుంచి వొకకన్ను చురుకుగా పరుగెత్తింది. ఎదురుగుండా సుమారు నూరు గజాలదూరంలో మూడు రోడ్లు కలిసినచోట కబంధుడి కన్ను ప్రకాశిస్తూంది. దాని కిందనించి జోరుగా తనవెంపు వొక గుఱ్ఱపు బండీ పరుగెత్తి వొస్తూంది. ఆ బండీ లాగుతున్న గుఱ్ఱానికి రెండే కాళ్ళు, 'బెంయి, బెంయి, బెంయి,' ఎనుపోతు అస్చుకుంటూ వచ్చింది. దాని గుడ్లు ధగధగా మెరుస్తున్నాయి. దాని మీాద యమధర్మరాజు కూచొని దాని తలకాయని గుండ్రంగా మెలేసి తిప్పుతున్నాడు.

అబ్బ! ఎడం పక్కని యేం దృశ్యం! ఇదేదో స్వర్గం లాగుందే. నిజమే అదిగో దేవతాస్త్రీ. ఆమె తలమీాద కొమ్ములున్నాయి. కాళ్ళకి డెక్కలున్నాయి. ఆమె దేవతా వస్త్రం ధరించింది. ఆమె భూమికి జానెడెత్తు గాలిలో తేలుతూంది. ఆమె పైట చెంగుకు అంటుకుని మూసవాకారంగల వొక కీటకం వుయ్యాల లూగుతూంది. అట్లాంటి దేవతాస్త్రీలు



కీటకాలు ఆస్వర్గంలో చాలా వున్నాయి. స్వర్గద్వారం మీద మెరుస్తూన్న అక్షరాలు చూశాడు కాశీ 'The city Emporium' అని వుంది.

మరి రెండు అడుగులు వెళ్ళగానే వొక గుహతగిలింది. ఆ గుహలో క్రూర జంతువులు విందారగిస్తున్నాయి. పంట చేలలో బురదలో మురిగిన కాళ్లు, డిశంబరు నెల చలిలో గడగడలాడి పోయిన గుండెకాయలు, కుంభ వృష్టిలో తడి బట్టలా నీళ్ళుకారిపోయిన శరీరాలు వాళ్ళ రెండు పళ్ళవరసల నడుమా నలుగుతున్నాయి.

గుహబైట వెలుగు చీకటిగా, గుహలోపల సూది రాలి పోతే అగుపించేంత వెలుతురుగావుంది. గుహలోకి వెళ్ళగానే కుడిపక్క పెద్ద రాతి పణుకుమీద వొక బలిష్టమైన మహా క్రూర జంతువు కూచుంది. దానికి లోహపు ఫలహారాలంటే మిక్కిలి యిష్టం. కాశీ ఆ గుహ దగ్గరకు రాగానే కాకతాళీ యంగా రాతి పణుకుమీద కూర్చున్న క్రూరజంతువు ప్రక్కకు తిరిగి అతడిని చూసింది. వెంటనే లేచి 'కాశీనాథ్' అని అరి చింది. కాశీ ఆగిపోయేడు. అత డాలోచనల క్లోరోఫారం మైకంలో వున్నాడు. ఆ జంతువు గుహద్వారం దగ్గరకు రాగానే కాశీకి ద్వారం నాలుగంచులకూ తాకుతూ వొక పెద్ద నవ్వుతూన్న నోరు గోచరించింది. అది క్రమక్రమంగా 'ఫేడ్ అవుట్' అయి దానిలోంచి కాఫీహోటల్ ప్రొప్రయి టర్ కృష్ణయ్య ఫుల్‌సూటులో చిరునవ్వుతో ప్రత్యక్ష మయ్యేడు. కాశీ అప్రయత్నంగా గుహలో జొరబడ్డాడు.



వాళ్ళిద్దరూ ప్రొప్రయిటర్ ప్రైవేట్ గదిలోకి వెళ్ళేరు. గదినిండా కుర్చీలు, మేజాలు, సోఫాలతో హాయిగా యిమ్ముగా వుంది. గోడలకు సినీమా స్టార్ల ఫోటోలు వ్రేలదీసివున్నాయి. గది గుమ్మానికి కెదురు గోడమీద అర్ధనిమీలిత లోచనాలతో తపస్సుచేస్తూన్న శంకరుడి చిత్రం, యెడంప్రక్క గోడదగ్గరగా వున్న గుండ్రని గాజు మేజామీద వొకకాలు పైకెత్తి, రెక్కలు సగం విప్పి యెగిరిపోవడానికి వురికివస్తూన్న కొమ్ము కొంగ, వాటివాటి స్థలాలలో చక్కగా రాణిస్తున్నాయి. గదినిండా చల్లని తెల్లని వెలుతురు ప్రకాశిస్తూంది.

ఈ అలంకరణ చూడగానే గదికలవాడు చాలా కళాభి రుచి కలవాడని తోస్తుంది. ఇటువంటి తప్పుడు ఆలోచన వొక కళాశిల్పం చూసినప్పుడల్లా తోచడం సహజమే. అందమై, నిర్మలమై పవిత్రమైన హృదయాలకు కంటె కింపైన శరీరం వుండడం అరుదు. కవిసన్మానం చేసే పెద్దమనిషికి రస హృదయం కలగడం మహాభాగ్యం. జీవితపు విలువలు రూపా యలులోకి మార్చుకుని అర్థం చేసుకునే కృష్ణయ్యకు హృద యంలో కళాజిజ్ఞాస వుందనుకోవడం భ్రమ. కాని, అతడికి విశ్వవిద్యాలయపు వాసన లభించింది. కాసుంది. అందమైన భార్య వుంది. సమాజంలో పలుకుబడి వుంది. అయితే, ఆ గదిలో వెలుగులు చిమ్ముతూన్న కళా మణిదీపిక అతడి స్వంతం కాదు. అది విశాల గంభీరమైన కాశీ హృదయంలో ప్రభవిల్లినది.

కాశీ వొక సోఫామీద కూలబడ్డాడు. సిగరెట్టు ముట్టిం చేడు. కృష్ణయ్య లోపలనుండి రెండు కూల్ డ్రింకులు తెచ్చి

3

నొకటి కాశీకిచ్చి తను కాశీకి దగ్గరగా వున్న కుర్చీలో కూచు న్నాడు. కూచుంటూనే అడిగేడు.

'ఉదయం రాలేదేం – పన్నెండువరకూ చూశా.'

'ఎంత ప్రయత్నించినా తెములలేకపోయేను.'

'నువ్వు వెయ్యికాళ్ళ జెర్రివి. About six మూర్తి వచ్చేడు. కాశీ వచ్చేడా అని అడిగేడు. లేదన్నా. నేనూ ఉదయంనుంచీ కాశీకోసమే యెదురు చూస్తున్నా అన్నా. Then I left for home. About seven Dr. Raju's daughter Miss. Vasantha వచ్చింది. ఎప్పుడూ రావడం మామూలు లేదు. నేనూ నా వైఫ్ ఆశ్చర్యపోయేం. ఒక పదిహేను నిముషాలు కూచుంది. ఒచ్చినప్పటినుంచీ ముళ్ళ మీద వున్నట్టే వుంది. వెళ్ళిపోతూ నువ్వొచ్చావా అని అడిగింది.'

కాశీ గతుక్కు–మన్నాడు. ఎంతమందికైనా తను ఆశా భంగం కలిగించగలడు గాని వసంతకి ఆశాభంగం కలిగించలేడు. ఆమె సుడిగాలి. ఆమెకు తనదగ్గర చాలా చనువుంది.

వసంత తండ్రి డా॥ రాజు. ఆ వూళ్ళో చాలా పలుకు బడి కలిగినమనిషి. డాక్టరుగానే కాకుండా ఆ వూళ్ళో ఏ హడా వుడి జరిగినా అందులో యేదో ముఖ్య పాత్ర నిర్వహిస్తున్నా డన్న మాటే.

పది సంవత్సరాల క్రిందట కాశీకి డా॥ రాజుకు స్నేహం యేర్పడింది. అప్పటికి వసంత ఆరేళ్ళ పిల్ల. సుమారు ప్రతి రాత్రి కాశీ డాక్టరు యింటికివెళ్ళి మూడు నాలుగు గంటలసేపు బాతాఖానీ కొడుతూండే వాడు.



నకు నడుమ గోపిక, చెట్టపట్టాలతో వలయాకారంగా నృత్యం చేస్తున్నారు. నడుమ మదన సామ్రాజ్య చక్రవర్తి, నీలమేఘ శరీరుడు, వత్సహస్తపాదంతో నిలబడి చిక్కుడుకాయలవంటి వేళ్లతో మధుర మురళిగానం చేస్తున్నాడు. చిత్రంచూడగానే లీలాశుకుడి అంగనా మంగనా మంతరే మాధవమ్, మాధవం మాధవం చాంతరే చాంగనా...' జ్ఞాపకం వస్తుంది.

పూజముగించి వచ్చినయువతి చిత్రంముందు తదేక దీక్షతో నించుంది. శ్యామసుందరుడియెల తీపి చిరునవ్వు, కొనకళ్ళ కొంటెచూపు, నెమిలి తురాయి చూచినకొలది ఆమె హృదయంలో మధురభక్తి పొంగి పొర్లింది. ఆమె ప్రతీ అంగంలో చైతన్యం కలిగింది. ఆమె పరవశంతో నాట్యం చేస్తూంది.

ఇదేవిధంగా రోజూ గోపీలోలుడి ముందు నాట్యం చేస్తుంది. ఆమె భక్తిపారవశ్యంలో చేసే ఆ నృత్యమే ఆమె తపస్సుకు సమాధిస్థితి. ఆమె మదనగోపాలుడిని తన హృదయంలో ప్రతిష్టించింది. ఆమె ధృతగతిలో నృత్యం చేస్తూంటే ఆమె హృదయం యమునాతటినీ తటాచలంపై బృందా వనంగా మారుతుంది. అక్కడ యెప్పుడూ నవవసంతమే. చిలకల గండుకోయిల కలరవాలే. అట్లాంటి తీయనివేళ పాలు పిటికినట్లున్న వెన్నెలలో గోపికా సహస్రంతో నీలమేఘ శరీరుడు ఆడుతు, పాడుతున్నాడు.

ఆ గోపికలతో తనుకూడా చేరాలని మధుసూదనుడి కరస్పర్శవల్ల తనువు పులకించి జీవితం ఫలించాలని ఆమె వుబలాట పడుతూంది. చుక్కలలో చంద్రుడివలె గోపికల నడుమ



విరాజిల్లుతూన్న కృష్ణుడిని ఆమె యమునకు అవతలి వొడ్డు నుండే ఆనందంతో, ఆశ్చర్యంతో, కాంక్షతో చూసి పరవశం చెందుతుంది. కాని, ఆ బృందాన్ని ఆమె చేరలేదు. ఆమెకు వారికీ నడుమ నది అడ్డుగా వుంది.

ఆ దినంకూడా ఆమె అలాగే నృత్యం చేసింది. ఆడి ఆడి అలసిపోయి మండపంలో వొక మూలకు తూలిపోయి, కూలిపోయి సొమ్మసిల్లిపోయింది.

అలా యెంతసేపు స్పృహతప్పి పడివుందో ఆమెకే యెరుకలేదు. ఇంతలో చల్లని రివటగాలి తెరలుతెరలు వీచి ఆమెను మృదువుగా స్పృశించింది. ఎక్కడిదో కోమలమైన వేణుగానం ఆమె చెవులకు సోకింది. ఆ గానంతో ఆమెకు బాగా మెళుకువ వచ్చింది. కళ్ళు విప్పుతూనే గోడమీద వో చిత్రంకెంపు చూసింది.

సుమారు పధ్నాలుగేళ్ళ వయస్సు గల పసులకాపరి బాలు డొకడు కుడ్యచిత్రానికి చేరువగా నిలబడి పిల్లనగ్రోవి వూదుతున్నాడు. ఆమె పడివున్నది పడివున్నట్టే చూస్తూంది. ఆమె ఆ బాలుని తన్మయ వేణుగానానికి అసూయపడింది. తను ఉపాసించే నృత్యకళ వుత్కృష్టమైనది. అటువంటి కళ ద్వారా తను పూజించే నారీహృదయ చోరుని యింకెవరూ మరే కళద్వారాకూడా ఆరాధించకూడదని ఆమె వుద్దేశం. ఆమె హృదయం యీర్ష్య, క్రోధంతో తుకతుక వుడికిపోయి లేవడానికి శక్తిలేక ఆ గోపాలుడికేసి చూస్తూ వేణుగానం వింటూంది.



వేణుగానం అమృతోపమానంగా మేఘాలమీద పరు గెడుతోంది. అతడు తదేకదీక్షతో తన పరిసరాలను మరచి, తననే మరచి పిల్లనగ్రోవి వాయిస్తున్నాడు.

ఇంతలో చూస్తున్న సుందరిచూస్తూనే వుండగా ఒక చిత్రం జరిగింది. మండపంమీద అప్పుడే విడిన పూలసువాస నలు ఒక్కుమ్మడి గుబాళించేయి. కుడ్యచిత్రంలోవున్న ప్రకృతి నిజమైన ప్రకృతిగా మారి చిగురాలులకు ఆకులు కదల తొక్కాయి. యమునానదీ జలాలు గలగలా ప్రవహింప జొచ్చాయి. కుడ్యంలోంచి ఒక్కొక్క గోపిక, ఒక్కొక్క కృష్ణుడూ చైతన్యంకలిగి మండపంమీదికి దిగివచ్చి గోపబాలుడి చుట్టూ గుండ్రంగా యిటు తిరుగుతూ అటు తిరుగుతూ నృత్యం చేస్తున్నారు. గోపబాలు డిదేమీ గమనించలేదు. మూసినకళ్లు మూసినట్లేవుంచి వేణు వూదుతున్నాడు.

ఇది చూడగనే సుందరి హృదయం ఒక్కసారి ఆగిపోయి తిరిగి జోరుగా కొట్టుకొనజొచ్చింది. ఆమె దిగ్గునలేచి కూచుంది. పరుగునవెళ్ళి ఆ బృందంలోచేరి నృత్యం చెయ్యాలని అనుకుంది. కాని అలా చేస్తే వాళ్లంతా మాయమైపోతారేమో అని భయపడింది. ఆనందంతో పరవళ్ళుద్రొక్కుతూ ఆ దృశ్యాన్ని చూస్తూ ఆమె అక్కడే అలాగే కుడ్యచిత్రంలా నిలబడి పోయింది.

కొంచెంసేపు గడిచిన తరువాత నిమ్మళంగా అతని వేణుగానం వారి నృత్యం తాళీపడుతూ సన్నగిల్లేయి. మరి కొంతసేపటికి కుడ్యంమీంచి దిగివచ్చినవాళ్ళు అలాగే, ఆ

4

వయసులోనే తిరిగి గోడమీదికి వెళ్ళిపోయి యథాపూర్వకంగా చిత్రమైపోయేను.

ఆ బాలుడు కళ్ళువిప్పి మురళి మొలలో దోపుకొని నెమ్మదిగా ఆలయం బయటకు దారితీశాడు. అతని వెనువెంటనే ఆమె దిగ్భ్రాంతితో నెమ్మది నెమ్మదిగా నడిచింది......

అది నృత్యనాటిక. ఆ నాటికలో నాయికగా వసంత నృత్యం చేస్తుంది. నాటికకు సాహిత్యం నాట్యాచార్యులే వ్రాశారు. శాస్త్రానికి సంబంధించినంతవరకూ, ఆహార్యం ఎలావుండాలో కాశీకి బోధపరిచేరు. ఆ విషయాలు కాశీకి తెలియనివి కాకపోయినా అతను శ్రద్ధగా విన్నాడు. అప్రయత్నంగా సిగరెట్టు పీలుస్తూ పొగలోంచి పరాకుగా చూస్తూ నాటికలో రంగాలు, పాత్రలూ, సమయానుకూలంగా కావలసిన వాతావరణం ఆలోచిస్తున్నాడు.

లేత వయసువాడైన నాట్యాచార్యుడు దివ్యసుందర రూపం కలవాడు. జ్ఞానదేవుడు, బుద్ధ భగవానుడు, శ్రీకృష్ణుడు మొదలైన శాంత శృంగార రసప్రధానమైన పాత్రలకు తగిన వ్యక్తి. కృష్ణపాత్ర అతడే నిర్వహిస్తాడు.

ఒక నదిఒడ్డు. దాని ప్రక్కనే ఒక కోవెల. కోవెలలో మండపం. గోడమీద రాసక్రీడ బొమ్మ. యమునానది. కొద్దిగా యిసుకతిన్నెలు. మరొకప్రక్క బృందావనం. నవ వసంతం. గండుకోయిలలు. మురళీ మోహనుడు. మన్మథుడి వాడిములుకులవంటి గోపికలు. ఇవన్నీ సెట్టింగులు తయారు చెయ్యాలి. ఒకప్రక్క వెన్నెలరాత్రి ప్రకృతిశోభ, వేరొక

దాని మీద పడుతున్నాయి. ప్రభ, కాశీల నీడలు అప్పుడప్పుడు జంటగా అగుపిస్తున్నాయి. ఇటూ అటూ తిరగడంలో అప్పు డప్పుడు వాళ్ల నీడలు కలిసి పోయినట్టగుపిస్తున్నాయి.

ఒక ఐటమ్ ముగిసింది. చావడిలో వాళ్లు "మాట్లాడు కుంటున్నారు. వసంత కాళ్లు ముడుచుకొని, చేతులు వాళ్లో పెట్టుకుని నేలమీద కూచుంది. ఆమె ముఖంమీద మెడపైన చెమట చుక్కలు మెరుస్తున్నాయి. ఆమెకు నాట్యం మీద, ప్రదర్శనం మీద, మొత్తానికి జీవితం మీదే రుచి నశించింది. రేపు జరగబోయే నాట్య ప్రదర్శనం తప్పని తద్దినంలా వుంది.

స్టుడియోగదిలోంచి గొల్లున నవ్వు వినిపించింది. అన్ని గొంతుల మధ్య ప్రభ కంఠం చిరు మువ్వలు ఝుళిపించినట్లుంది. వెంటనే వసంతకు ప్రస్తుతపు నృత్యనాటిక తన జీవితనాట కాన్ని ప్రతిబింబిస్తూందా అనిపించింది. కాని తనజీవిత నాట కంలో కృష్ణుడిచుట్టూ అంతమంది గోపికలులేరు. అందర్నీ కలిపినా మొత్తం మీద యింకా పది శాపువులు యెక్కువ తూగే వొక పిశాచం మాత్రం అగుపిస్తూంది.

అప్పటి వరకూ కాశీమీద తనకంత ప్రేమవున్నదని ఆమెకు తెలియలేదు. అతడి నొక కళారాధకుడుగా తను గౌరవిస్తున్నాననుకొన్నది. అతడు చిత్రకారుడుగా, శిల్పిగా తనలోని కళా సౌందర్యాన్ని మెచ్చుకుంటున్నాడని నమ్మి గర్వించింది. అంతే కాని తన హృదయంలో అతడి ప్రభావం వొక బలవత్తరమైన జయస్తంభంగా పాతుకు పోయిందని ఎరగదు. అది తనకు గుర్తురావడం, దానిని మొదలంటా పెక లించి పారవేసే ప్రళయ ఝంఝూ మారుతం విసిరి కొడుతూన్న



దని గ్రహించడం సుమారు వాకే మారుజరిగాయి. ఈ రెంటి నడుమా ఆమె నలిగి సతమతమౌతూంది.

ఆవేళ ఆఖరు రిహార్సెల్సు, రాత్రి పదకొండు దాకా స్టూడియో గదిలోంచి అంతా బయటపడి యిళ్లకు వెళ్ళేరు.

ఆ రాత్రి వసంతకు నిద్రపట్టలేదు. కడలేని వేదనపాలై పోయింది. కాశీమీద కోపం, ప్రభమీద ద్వేషం హద్దుమీరి పోయేయి.

ఉదయం లేచేసరికి ఆమెకు తీవ్రమైన జ్వరం తగిలింది. తండ్రి చాలా గాభరాపడ్డాడు. ఎల్లుండే ప్రదర్శనం. కావలసిన యేర్పాట్లన్నీ అయిపోయేయి. కూతురు ఆరోగ్యం బాగు లేకపోతే తనకు చాలా ఆశాభంగం అవుతుంది. తన భుజాలకు తగులుకునేందుకు దేవలోకంనుంచి యెగిరి వస్తూన్న రెక్కలు తనదాకా వచ్చి యెటో యెగిరిపోతాయి. వెంటనే పెన్సిలిన్ చికిత్స ఆరంభించేడు.

సాయంత్రం నాలుగుగంటలకు ఆమె జ్వరం తగ్గింది. కాని ఆమె నీరసంగానే వుంది. ఇల్లంతా చల్లగావుంది.

సాయంత్రం యేడుగంటలకు మామూలుగా కాశీ వచ్చేడు. అతడు పదిరోజులై కష్టపడి పనిచేస్తున్నాడు. ఎవరి తొందరలో వాళ్ళున్నారు గాని అతడు తిండి తిన్నాడో లేదో కనుక్కొన్నవాళ్ళు లేరు. గడ్డం చేసుకుందికి కూడా వోపిక లేక అతడి గడ్డం ఒత్తుగా పెరిగింది. సిగరెట్లు గొలుసుకట్టుగా కాలుస్తున్నాడు. అరగంటకాలం డాక్టరుతో మాట్లాడి తన పని చూసుకుందికి స్టూడియో గదిలోకి వెళ్ళిపోయాడు.



భార్యా భర్తలు హాహాకారీగా దెబ్బలాడుకునే ముందూ కొన్ని గంటలో, కొన్ని రోజులో నిశ్శబ్దంగా తమూ యిస్తారు. డాక్టరు యిల్లు అలాగే వుంది. స్టూడియోలో కాశీ, చావడిలో డాక్టరు వాళ్ళవాళ్ళ పనులు చూసుకుంటున్నారు. డాక్టరు చావడిలోంచే గదిలోవున్న కాశీతో వసంతకు కొంచెం నయంగా వుందని, మర్నాడుదయానికి బాగా కులాసాగా వుంటుందని చెపుతున్నాడు. మేడమీద గదిలోంచి వసంత వింటోంది. టెలిఫోన్ సంభాషణలా తండ్రిమాటలు మాత్రమే వినిపిస్తున్నాయిగాని కాశీఏమంటున్నాడో తెలియడం లేదు. చివరకు మాత్రం అతడన్న వొక్కమాట వినిపించింది. 'ప్రభ చాలా తెలివైనది. నిన్నటివరకూ చకచక సాగిన నా 'బ్రెయిన్'కు యివాళ బ్రేకు పడింది. ఈ మాటలు అసలే నీరసంగావున్న వసంత గుండెల్ని బాకుల్లా చీల్చేయి. ఆమెకు అలాగే మూర్ఛ వచ్చినట్లయింది. నిరాశవల్ల అలాగే నిద్ర పట్టినట్లయింది.

# 9

మర్నాడు వుదయానికి వసంత జ్వరం జారిపోయింది. నీరసంగా వుంది. కాని ఆమెకు నీరసం బాధకన్న ప్రభమీద యీర్ష్యవల్ల కలిగినబాధ యెక్కువగా వుంది. ఇక కాశీ తన వాడుకాడు. తను నర్తకిగా యెంతపేరు సంపాదిస్తేనేం. ఆమె వాడిపోయిన వదనం యెప్పుడూ యేదో ఆలోచిస్తున్నట్టుండడం

డాక్టరు గమనించక పోలేదు. కాని దానికి నిజమైన కారణం అత డెరుగడు. అప్పుడే ఆమె జ్వరంనించి కోలుకుంది. అందుకే అలా వుందనుకున్నాడు.

ఆమెకు ప్రోత్సాహకరంగా వుండాలని ప్రతి నిముషం ఆమె ఆరోగ్యస్థితి కనక్కుంటున్నాడు. ఆమె నాట్యం చూడడానికి యెంతెంత దూరంనుంచి యెవరెవరొస్తున్నారో ఆమె వింటూండగా యితరులతో పదేపదే చెపుతున్నాడు.

మధ్యాహ్నం రెండు గంటల నుండీ డాక్టరు యిల్లు ఆడ పెళ్ళివారిల్లులా వుంది. డాక్టరు యింటికీ, ప్రదర్శనశాలకీ మధ్య డీసెల్ కాకులా తిరుగుతున్నాడు. కమిటీవాళ్ళు ప్రదర్శన భారమంతా డాక్టరు నెత్తిమీాద పడవేసేరు.

కాశీ తొలినాడు రాత్రి శివరాత్రిచేసేడు. రెండు గంటలకు సెట్టింగులు పూర్తిచేసేడు. రెండునుంచి నాలుగువరకూ సిగరెట్టుకాలుస్తూ డాబామీాద పచారుచేస్తూఆలోచిస్తున్నాడు.

స్త్రీ హృదయం వెన్నవలె మృదువైనది. మంచులో తడిసి జిడ్డుతేలిన పువ్వువలె కోమలమైనది. కాని ఆ మార్దవం గండశిలగా మారగలదు. ఆ కోమలత్వం పెనుమంటలై చెలరేగ గలదు. అమృత కలశం వంటి ఆమె హృదయం విష కూపంగా మారగలదు. అందుకే స్త్రీని ప్రకృతి అంటారు.

బంగారు పంటను పండించి ప్రపంచాన్ని భరించే భూమాత వొకొక్కప్పుడు పట్టణాలకి పట్టణాలను తన పొట్టను పెట్టుకుంటుంది. వెన్నెల విరిసే, చుక్కలు మెరిసే ఆకాశం పిడుగులు కురుస్తుంది.



తెల్లవారితే ప్రదర్శన దినం. వసంత తనకు చివర హెచ్చరిక యిచ్చింది. కొంపతీసి నాట్యం చెయ్యనని హఠం పడుతుందేమో చాలా అల్లరి ఔతుంది. ఈ గంద్రగోళంలో తన పేరు బైట పడవచ్చు. అతడు గాభరాపడి జోరుగా సిగరెట్టు పీల్చి పచారు చేసేడు. క్రింద చావడిలో గడియారం నాలుగు కొట్టింది. క్రిందికి దిగి కుళాయి దగ్గర ముఖం కడుక్కు న్నాడు. అతని అలికిడికి డాక్టరు లేచేడు.

'కాశీ! నువ్వేనా. టైమెంతైంది?'

'నాలుగు కొట్టేరు.'

డాక్టరు లేచి వీధి చావడిలో పడుకున్న ఇద్దరు బంట్రో తుల్ని లేపేడు. రిక్షాలమీద సెట్టింగులు పెట్టించి ఆ ప్రభాత వాయువులలో, నిర్మానుష్యమైన వీధులగుండా వాటిని ప్రద ర్శన శాలకు తీసుకు వెళ్లేడు.

రెడ్ క్రాస్ వుత్సవం సాయంకాలం కార్యక్రమం జయ ప్రదంగా ముగిసింది. ఇది చివరకొస్తూంటే గ్రీన్ రూములో హడావుడి యెక్కువౌతూంది.

హాలులో జనం కిటకిటలాడుతున్నారు. ముందు వరసలో భూలోక దేవతలు కూచున్నారు. ముందువరసలోని పురుషులు చిరునవ్వులతో చిదానందంగా యిరుగుపొరుగు రంభల హృదయాలకు కితకితలు పెట్టాలని వుబలాటపడు తున్నారు. ముందువరుసలోని కోమలాంగులు కూర్చున్న పాళంగానే అలసిపోతూ చేతిరుమాళ్ళతో ముఖాలద్దుకుంటు న్నారు.

అంతలో వొక మేనక అందరూ తనవంపే చూస్తున్నా రని నమ్మి తనుమాత్రం యెవ్వరివేపు చూడకుండా చిరు నవ్వుతో బెట్టుగా స్టేజిపైపే చూస్తూంది. ఒక తిలోత్తమ ఉండుండి ఎటునైపో చూసి అప్పుడే అగుపించిన వొక స్నేహితురాలివెంపు కొండంత చిరునవ్వు విసురుతూంది. వేరొక వరూథిని తనుచు విరగబడుతూంది.

డాక్టరు గేటుకు, ముందు సీట్లకు నడుమ చావు బ్రతుకుల చక్రంలా తిరుగుతున్నాడు.

గ్రీన్ రూమ్‌లో 'అలరింపు'కు తగిన అలంకణ వసంతకు నాట్యాచార్యుడు చేస్తున్నాడు. వసంత ఉదాసీనంగానే వుంది. ఆమె విశాలమైన కోలకళ్ళలో విచారం తొంగిచూస్తుంది. ఆమె పరిస్థితి నాట్యాచార్యుడికేమీ అర్థంకాలేదు. ఎన్ని ప్రశ్నలు వేసినా ఆమె జవాబు చెప్పలేదు. 'అలరింపు' తరవాత నృత్యనాటిక సెట్టింగులు అమర్చడంలో కాశీ నిమగ్నం అయివున్నాడు. ప్రభకూడా చాలా హడావుడిగా వుంది.

'ప్రభా! నృత్యనాటికకు వసంతను అలంకరించడంలో నాట్యాచార్యులవారికి నువ్వే సాయం చెయ్యాలి. నాకు వేరే చాలా పనివుంది' కాశీ. ప్రభ అలాగే అంది. కాని యీ మాటకు వసంత నిలువునా వుడుకెత్తిపోయింది. పొంగివస్తూన్న దుఃఖాన్ని అపుకోలేకపోయింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు గిరగిరా తిరిగిపోతున్నాయి.

'మా కెవ్వరి సాయం అక్కరలేదు' వసంత.

కాశీ గతుక్కుమన్నాడు, ప్రభ నివ్వెరపోయింది.

'అదేమిటి వసంతా! అలా అనొచ్చా. వారంరోజుల నుంచీ ప్రభ నీకోసం యెంత శ్రమ పడుతూందో నీకు తెలీదా?' కాశీ.

'ఎవరెవరికోసం శ్రమపడుతున్నారో నాకు తెలియక పోలేదు. ఆమెను మీకే సాయం చెయ్యనీయండి. నా యిష్టం ప్రకారం జరగకపోతే యిప్పుడే యింటికి వెళ్లిపోతా...'

ప్రభ చిన్నగా నవ్వింది. కాశీ సిగ్గుపడిపోయి అక్కడ నుంచి వెళ్ళిపోయేడు. నాట్యాచార్యుడు, అడ్డుపడి పరిస్థితిని అదుపులోకి తెచ్చేడు.

'అలరింపు' నృత్యం అవుతూంది. గ్రీన్ రూము వెనక వున్న వరండాలోకి కాశీ, ప్రభా వెళ్ళేరు. ఎదురుగుండా మహా సముద్రం హోరుపెడుతూంది. చల్లని గాలులు తెరలు తెరలుగా వీస్తున్నాయి. కాశీ సిగరెట్టు కాలుస్తూ జాలుకు ఆనుకొని నిల్చున్నాడు. అతనికి కొంచెం దూరంలో ప్రభ నుంచుంది.

'ప్రభా! మరేమీ అనుకోకు. వసంత వస్తుతః కొంచెం దుడుకుది. ఆ పిల్ల నాకు చిన్నప్పటినుంచీ తెలుసు. పట్టుదల మనిషి!'

'మరేం ఫర్వాలేదులెండి. ఆమె చిన్నది కూడాను. నేనేమీ నొచ్చుకోలేదు. కాని ఆమెకు నామీద అంతకోపం యెందుకు వచ్చిందో!'

ఈ ప్రశ్నకు యేం జవాబు చెప్పాలో తెలియలేదు. ఏం జవాబు చెపితే ప్రభ ఏమనుకుంటుందో అని అతడికి భయం వేసింది. అక్కడ వెలుగు చీకట్లుగా వుంది. అంచేత అతడు కొంచెం ధైర్యం వహించి నిలబడగలిగేడు.

'పిచ్చి పిల్ల ఒకవేళ మీరు నన్ను ప్రేమిస్తున్నారని అనుకోలేదు కద...'

ఈ ప్రశ్నతో అతడి ధైర్యంకాస్తా బొంగరపు తాడులా పుసికిపోయింది. అతడికి మాట పెగలటంలేదు.

'అనుకునే వుండవచ్చు. ఏమో! కాకపోవచ్చు. నా కర్థం కావడంలేదు. అసలామె కొద్దిరోజులనుంచీ అలాగే వుంటూంది...అయినా వసంత నా కళ్ళముందు పుట్టింది...!'

'మీరు నిజంగా ఒకరి నొకరు ప్రేమించుకోనివుంటే ఆమె అలా అనుకోవడంలో ఆశ్చర్యంలేదు...!'

కాశీ యిక పట్టలేకపోయేడు.

'ప్రభా! ఇక చాలించు. నువ్వు నన్ను క్కిరిబిక్కిరి చేస్తున్నావు. నే నొక బెందడిలో పడిపోయిన బండీలా వొడ్డెక్క లేకపోతున్నా. నే నెప్పుడూ వసంతని ప్రేమించలేదు. వసంతను నేను చెల్లెలిగా భావిస్తున్నా; అలాగే ప్రేమిస్తున్నా'.

'పోనీ, మీ రెవ్వరినైనా ప్రేమిస్తున్నారా?'

మొదట యీ ప్రశ్న అతనిమీద పిడుగులా పడింది. కాని మరునిముషంలో అతడికి తిరిగి కొంచెం ధైర్యం కలిగింది. అతడు తలవంచుకొని అన్నాడు.

'నే నొక అందని అందాన్ని ప్రేమిస్తున్నా. మృగజలం వెనుక తీరని దాహంతో పరుగులు తీస్తున్నా!' అతడు ఆవేశంతో అన్నాడు.

'అది తనంత తానే మీ చేరువగా వస్తే?' ఆమె తొణక కుండా ప్రశ్నించింది. అతడు నిశ్చేష్టుడయ్యాడు. భయం-

ధైర్యం అనే గొలుసులతో కట్టబడిన కర్తవ్యం అనే వుయ్యాలలో ఒక నిముషం వూగిసలాడేడు. ఆమె కళ్ళలోకి వెదుకుతూ చూశాడు.

'అంత అదృష్టం యీ జీవితంలో రాదు...!'

మాటలు తడబడుతూ అన్నాడు. దూరంగా ఆకాశం మీద యేదో చుక్క తళుక్కు తళుక్కున మెరుస్తూ, చీకటి ముద్దలాంటి తన జీవితంలోకి వెలుగు రేఖలు విసురుతూంది.

ఇలా మరో ప్రపంచంలో మునిగిపోయిన వీళ్ళకి అవతల 'అలరింపు' అయిపోయిందని తెలీదు. వీళ్ళలా మాట్లాడుకుంటూన్న సమయానికే వసంత గబగబ అక్కడకు వచ్చి, తిరిగి వెళ్ళిపోయింది. ఆమె పోతూండడం యిద్దరూ గమనించేరు. కాశీకి గుండెల్లో దడపట్టుకుంది. ప్రభ మొహట్లో గతుక్కుమన్నా, తరువాత యేమీ జరగనట్టు స్టేజివైపు నిశ్చలంగా వెడిపోయింది.

కాశీ, ప్రభా ఏకాంతంగా మాట్లాడుకోడం చూడగానే వసంతకు నఖశిఖ పర్యంతం కంపరం పుట్టింది. తన హృదయానికి వొక వజ్రాఘాతం తగిలినట్టయింది. ఆమెలోని పగ నల్లత్రాచులా పడగెత్తి బుసకొట్టింది.

నృత్య నాటిక ఆరంభం అయింది. సెట్టింగులు ప్రేక్షకులను ఆకట్టివేసేయి వసంత నిజపరిస్థితి నాటికకు మిక్కిలి అనువుగా వుండడంవల్ల నాటిక మరీ రసవంతంగా వుంది. నాటిక చూస్తూ ప్రేక్షకులు మైమరచి పోయేరు. కరతాళ ధ్వనులలో సముద్రపుహోరు మునిగిపోయింది.



నాటిక ముగిసిన తరువాత డాక్టరు తన కూతుర్నీ, నాట్యాచార్యుణ్ణి, కాశీని, ప్రభను తదితర హంగుదార్లను ప్రేక్షకులకు పరిచయం చేసేడు. ప్రభగురించి మరీ యెక్కువగా పొగుడుతూ చెప్పేడు: ప్రభ నమ్రతతో ప్రేక్షకులకు నమస్కరించి వెళిపోతూంటే కరతాళధ్వనులు మారుమ్రోగేయి. అది వసంత హృదయానికి రంపపు కోతగావుంది.

ప్రేక్షకులు వసంతను మరొక నృత్యం చేసి చూపమని కోరేరు—నాట్యాచార్యులు వొక 'తిలానా' చెయ్యమన్నారు. ఆమె నిరాకరించింది. తండ్రివచ్చి ఆమెను యెంతో బ్రతిమాలేడు. ఆమె ససేమిరా వొప్పుకోలేదు. కాని సభికులు పట్టుపట్టేరు. చివరికెలాగో అంగీకరించింది కాని ఆమె మనసు మనసులో లేదు. ఆమె నృత్యం చేస్తున్నదన్నమాటేగాని తిరిగి తిరిగి ఆమె కళ్లకు ఆ దృశ్యమే కడుతూంది. ఆమె మనోవేదనతో కృంగిపోతూంది. ధృతగతిలో నృత్యం చేస్తూచేస్తూ ఆమె నిలువునా కూలిపోయింది. డాక్టరు అదిరిపడ్డాడు. నాట్యాచార్యుడు స్టేజిమీదకు పరుగెత్తేడు. కాశీ యెటూపోలేక కాలుగాలిని పిల్లి అయిపోయేడు. ప్రదర్శనం అల్లకల్లోలంలో మునిగిపోయింది.

డాక్టరు వెంటనే వసంతకు ప్రథమ చికిత్సచేసి యింటికి తీసుకువెళిపోయేడు. ఆమె కుడికాలుకు చిన్న ఫ్రాక్చర్ అయింది.



# 10

మూడురోజులు ఖణీగా యెండ కాసింది. ప్రాణికోటి పెనంమీాది గోధుమరొట్టెల్లా ఆర్చుకుపోయేరు. ఆవేళ వుదయం హఠాత్తుగా మబ్బుపట్టింది. ఉదయంనుంచి చినికిచినికి మధ్యాహ్నానికి వానపట్టుకుంది. గాలి అంతగా లేదు.

కాశీ చావడి కిటికీ దగ్గరగా యీాజీచైరు వేసుకు ముడుచుకు పడుకున్నాడు. కిటికీలోంచి వాన చినుకులు చూస్తున్నాడు.

రెడ్ క్రాస్ వుత్సవాలైపోయి నాలుగు రోజులైంది. డాక్టరు తన కూతురు సంపాదించిన పేరుకు ఒకమూల వుబ్బి తబ్బిబ్బులౌతున్నా ఆమెకు జరిగిన ప్రమాదానికి చాలా విచారిస్తున్నాడు. ఆమె కాలి యెముక కొంచెం చిట్లింది.

ప్రదర్శనం మర్నాడు సాయంత్రం డాక్టరు స్నేహితులకు విందు చేసేడు. విందు తరువాత రాఘవేంద్రరావుగారు, ప్రభ, కాశీ మొదలైన దగ్గర స్నేహితులు వసంతని చూడ్డానికి ఆమె గదిలోకి వెళ్ళేరు.

వసంత కాలుకు జనరల్ ఆస్పత్రివాళ్ళు కట్టుకట్టేరు, మూడు వారాలవరకు ఆమె ఆలాగే పడుకొనివుండాలి.

ప్రభ వెళ్ళి ఆమె ప్రక్కమీాద ఆనుకుని కూర్చుంది. వసంత మొహం అటు తిప్పుకుంది. కాశీ బెదురుమొహంతో వాసాలకేసి చూస్తున్నాడు.



'అమ్మా నొప్పిగావుందా ?' రావుగారు.

లేదని వసంత తల వూపింది.

'అబ్బే యేమీ పెద్ద యాక్సిడెంటు జరగలేదండీ. స్వల్పం' డాక్టరు.

'లేత వయస్సులో యెముకలు వేగం అతుక్కుంటాయి...' ప్రభ అంది. వసంత మూలిగింది.

'ఔను. ఎముకలు వేగమే అతుక్కుంటాయి...' ఆ అనడంలో యేదో మరో అర్థం ధ్వనించింది. కాశీ చల్లగా వరండామీదకు జారుకున్నాడు.

'టెంపరేచర్ లేదు. నేను ఎక్సరే ఫోటో చూశా. స్లైట్‌గా ఎముక బీటపడింది. అదేముందీ...యిట్టే అతుక్కుపోతుంది.'

డాక్టరు యిలా అంటూనే వున్నాడు. వసంత వెక్కి వెక్కి యేడుపు ఆరంభించింది. 'భయపడకమ్మా వసంతా. నీ కాలు త్వరలోనే నయమౌతుంది. ప్రభ తరుచువచ్చి నిన్ను చూస్తూంటానంది. నీకు కాలక్షేపంగా వుంటుందంటే, నాలుగు రోజులపాటు రాత్రుళ్ళు యిక్కడే పడుకుంటుంది...' రావుగారు.

'ఏం వసంతా, వుండనా ?' ప్రభ.

వసంత తల గిరుక్కున యిటు త్రిప్పింది. 'నేను నీకు పదినెలల పసిపాపలా అవుపిస్తున్నానా' అందామనుకుంది.

'అబ్బే ! యెందుకమ్మా నీకీ శ్రమ. మరేం ఫరవాలేదు డాక్టర్.'

వసంత నీరసంగా అంది. 'ప్రభా! కాశీ నా బొమ్మ ఆర్నెల్ల క్రిందట ఆరంభించేడు. అదింకా పూర్తికాలేదు. అది పూర్తికాదు. పోనీ, నా కాలు విరిగింది. ఇలా విరిగినకాలుతో మంచంమీద పడుకున్నట్లు వొక బొమ్మ నువ్వెందుకు వేయ కూడదూ? జీవితాంతం ఆ బొమ్మని చూస్తూ సంతోషిస్తా...'

ప్రభ నవ్వి వూరుకుంది. ఈ సంభాషణ వరండామీంచి వింటూ కాశీ వుక్కిరిబిక్కిరై పోతున్నాడు.

అంతా బైటకు నడిచేరు. ప్రభ వెళ్ళిపోతుంటే వసంత తిరిగి 'ప్రభా! బొమ్మ వేస్తావుకదూ!' అని కన్నీరు జడివానగా కురిసింది.

వాన చూస్తూ నెమరేసుకుంటున్నాడు కాశీ.

వర్షం జోరెక్కుతూంది. వాతావరణం మరీ చల్లబడి గాలికూడా రేగింది. తిరిగి సముద్రగర్భంలో వాయుగుండం బయల్దేరింది కామోసు. ఈ వూరి కిది వొక అలవాటైపోయింది. ఇక్కడ ఋతువుల ప్రభావం క్రమంగాగాని, యెక్కువగాని వుండదు. సముద్రంలో వాయుగుండం పుడితే వూరికి ముసురు తప్పదు. ఒకమాటు వాతావరణ పరిశోధన శాఖవాళ్ళు వుప్పెన వొస్తుందని ప్రజలను హడలెత్తించారు కూడ.

కాశీ మొదటిసారిగా తన విషయంలో ఆలోచిస్తు న్నాడు. నాలుగు రోజుల క్రిందట డాక్టరు యింట్లో విందు భోజనం చేసేడు. అంతే. ఆతరువాత భోజనంలేదు. ఒక్కసారి బాగా ఆకలివేసినప్పుడు పోకముడి అయ్యర్ హోటలుకు వెళ్ళేడు.

కాశీని చూడగానే మామూలుగా చిద్విలాసంతో నవ్వేడు.



'రండీ, రండీ, ఆర్టిస్టుగారూ - దయచేయండీ!' బ్రహ్మ జెముడుపళ్ళవంటి గుత్తులు గుత్తులు పళ్ళు బైటపెడుతూ ఆహ్వానించేడు. కాశీ కూచున్నాడు.

'టిఫిన్ చేస్తారా?' భార్య ప్రియమైన భర్తను అడిగినట్లడిగేడు. కాశీ అలాగే అని తలవూపేడు.

టిఫిన్ ఆత్రుతతో తిన్నాడు. డబ్బులు లేవని చెప్పబోతూంటే, అయ్యారు తిరిగి ఎఱ్ఱసిరా ముద్దలవంటి పళ్ళను బైటపెట్టి తలకాయ యిటూ అటూ ఆడించేడు.

కాశీ బైటపడ్డాడు. టిఫిన్ కడుపులోకి వెళ్ళిన దగ్గర నుండీ కడుపులో తిప్పుతూంది. అది టిఫిన్ దోషమో, తన దోషమో తెలీదుగాని, హోటలు వీధిమలుపు తిరుగుతూంటే భళ్లున వాంతి అయిపోంది. నీరసంవల్ల, వాంతి గాభరావల్ల కళ్ళుతిరిగేయి. జోగుతూ తన గూడు చేరుకున్నాడు. తిరిగి గడప దాటలేదు.

వాన నగారామోతగా వుంది. ఎండలో మాడిపోయిన జీవాలకు హాయిహాయిగా వుంది. గోచీలు కట్టుకొని పెంకె కుంకలు వానలో కేకలేసుకు తిరుగుతున్నారు. ఆ వీధిలో వున్న పిచ్చివాడుకూడా వాళ్ళమధ్య వున్నాడు.

వాడు పిచ్చిపాటలు పాడుతూ గెంతుతూంటే కుఱ్ఱాళ్లు వాడిమీద రాళ్ళూ, మన్నూ విసురుతున్నారు. వాడు వాళ్ళని తిడుతూంటే, వాళ్ళు గొల్లుమని విరగబడి నవ్వుతున్నారు. ఈ బృందం అంతా చంగుచంగున దాట్లేసుకుంటూ కాశీ వీధి అరుగు యెక్కేరు. కిటికీలోంచి కాశీని చూసి గుసగుసలతో, 'ఊరుకోండ్రా ఊరుకోండి' అనుకున్నారు. 'పల్లకొండేహ్

దొంగనాకొండెల్లారా' అని పిచ్చివాడు వాళ్లని గద్దించి కాశీ వేపుచూసి చిరునవ్వు పెంకిగా నవ్వేడు.

'వోరె పిచ్చిపుల్లయ్యా! ఏనుగు బొమ్మరాయరా— యిందా బొగ్గు' అన్నా డొకుర్రవాడు. వాడివేపు పిచ్చివాడు యెఱ్ఱగాచూసి ముక్కుమీద వేలేసుకున్నాడు.

'పోనీ వోపిచ్చోడి బొమ్మ రాయిరా' అన్నా డింకొకడు. అంతా గొల్లున నవ్వేరు. 'పల్లకొండేహే' పిచ్చివాడు గద్దించి, కాశీవేపు వొకచూపు విసిరేడు.

'నాను రాయినేననుకున్నావా? ఏటనుకున్నావో. నే నేబొమ్మ పడితే ఆ బొమ్మే రాయిగల్ను.'

'నేను రాయనంటే రాయను! ఏటనుకున్నావో. నువ్వడగ్గానే రాసేత్తానా!'

'పోనీ, గాడిదబొమ్మ రాయిరా'

'ఓహో! తెలివెక్కువైపోయిందే!' మడిసికీ – గాడి దకీ బేద మేమిట్రా, తోకొక్కటి తప్పిస్తే. ఈ రోజుల్లో సాలా మందికి మెదడులేదు. అందుకే అలగన్నా.' తిరిగి కాశీవేపు వో చూపు విసిరేడు.

'అందుకే మీరంతా యే బొమ్మపడితే ఆ బొమ్మ రాయంటున్నారు.'

పిచ్చివాడు నిజంగా బొమ్మలు రాయగలడు. వాడు నిలబడి గోడలమీద బొగ్గులతో రాస్తాడు. పడుకుని బెంచీల అడుగున రాస్తాడు. కూచుని రోడ్లన్ని బొగ్గుబొమ్మలతో నింపేస్తాడు. వీధిని వొక కొసనుంచి ఆరంభించి రెండో కొస వరకూ పక్షులు, జంతువులు, దేముళ్లూ, సినీమాతారల



బొమ్మలు నింపేస్తాడు. రాసిరాసి వొంటికాలిమీద నత్యం చేస్తూ పాటలు పాడుతాడు.

వాడి బొమ్మలకి కాశీ ఆశ్చర్యానందాలు పొందేడు. వాడొకరోజున తన వీధి మొదల్ని బొమ్మలు రాస్తున్నాడు. కాశీ అన్నాడు : 'ఒరే నువ్వు వీధి పొడుగునా బొమ్మలు రాయ లేవురా !' పిచ్చివాడు తలెత్తిచూసి గబుక్కున నిలబడ్డాడు.

'ఏటయ్యోయ్ ! మాటలు సబబుగారానీ. నువ్వు రాత్తావా ? సూడు ! నాను రాయగల్ను. రాస్తాను. ఇదిగో రాస్తున్నా !' అని అదేపనిగా వందలకు వందలు బొమ్మలు కాశీ యింటివరకూ రోడ్డుమీద నింపేడు. కాశీ యింటి దగ్గరకు రాగానే కాశీ లోపలికి వెళ్ళి వెఱ్ఱివాడు వీధిలో బొమ్మలు రాస్తున్నట్టు తను రాసిన బొమ్మ తీసుకొచ్చి వాడికి చూపించేడు.

మొదట వెఱ్ఱివాడు బొమ్మ నిదానంగా చూసేడు. తరువాత చిరునవ్వు నవ్వేడు. 'అమ్మ దొంగా, నా బొమ్మ రాశావా ! ఇదిగోసూడు నీ బొమ్మ' అని ఛంగు ఛంగున వెళ్ళి ఎక్కడనుంచో మరొక బొగ్గుముక్క తెచ్చి కాశీ యింటి సైడు గోడమీద అరనిముషంలో కాశీ రేఖాచిత్రం రాసి పారేశాడు. కాశీ ముగ్ధుడైపోయేడు. వాడి కివ్వటానికి తనదగ్గర యేమీలేదు. భోజనం టికానా తనకే లేదు. ఇంతకీ భోజనం పెడితే వాడు తింటాడో తినడో జేబు తడివితే ఒక అణా దొరికింది. అదివ్వబోయేడు.

'సీ త్తిరికీ ! ! నాకెందుకూ—బీడీ యివ్వు.'

'బీడీలేదు' సిగరెట్టుపెట్టె యిచ్చేడు.



'పెట్టె నాకేలా! ఒకటివ్వు. అడిగినప్పుడల్లా యివ్వు.'

అప్పటినుండీ కాశీ వీధిలోనే వాడు తిరుగుతూంటాడు. వాడిచుట్టూ తరుచు జనంమూగి బొమ్మలు వ్రాయమంటారు. అడిగిన బొమ్మ రాయడు. కుక్క రాయమంటే కోతిరాస్తాడు. మనిషి రాయమంటే గాడిద రాస్తాడు. వాడి చిత్రజగత్తు మానవుడికి అభేద్యమైనది. వాడి వ్యూహ సామాన్య మానవుడికి తెలియని మహారణ్యాపు చిక్కుదారి. వాడీ కళోపాసన పూర్వ జన్మంనుంచీ తెచ్చుకున్నాడు.

ఇలా పిచ్చివాడూ, పెంకిపిల్లలూ గొడవచేస్తున్నారు. ఉండుండి గుద్దులాడుకుంటూ ఒకళ్ళనొకళ్ళు అరుగుమీంచి వానలోకి తోసుకుంటున్నారు. వీళ్ల ఆటలు చూస్తూంటే కాశీకి కొంత మనశ్శాంతి కలిగింది. ఆకలి కొంచెం మరుపు కొచ్చింది. కాని ఆలోచనలు దేవనిగా ఒకదానివెనుక వొకటి వస్తున్నాయి.

హోటల్ ప్రొప్రైయిటరు కృష్ణయ్య కొత్త హోటలు గురించి మరిచిపోయేడు. ఇప్పుడే హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది. ఆరాత్రి తరువాత తిరిగి అతడికిగాని, అవిమేలుకుగాని మొహం చూపలేదు.

వసంత త్రాచుపాములా పగబట్టింది. ఇంతకీ తప్పు పూర్తిగా ఆమెది కాదు. ఆమెచిత్రం తను పూర్తి చెయ్యలేదు.

ప్రభ! ఆమె నిజంగా తన అంధకారబంధురమైన జీవనానికి నూతనకాంతి ప్రభ. కాని, ఆమె గగనకుసుమం.

ఇలా ఆలోచిస్తూనే వున్నాడు. హఠాత్తుగా సినీమా ప్రొప్రైటర్ మూర్తి ఆ హోరువానలో గొడుగు సమే

తంగా వచ్చేడు. అతడు గుమ్మం యెక్కగానే పిచ్చివాడు, పిల్లలూ గొల్లుమని వీధిలోకి గెంతి అరుచుకుంటూ పరుగులు తీసేరు.

'హల్లో, మిస్టర్ కాశీ! మహాతీరికగా కూర్చున్నావే.'

'రావోయి మూర్తీ! తీరికే మరి. ఇలా వాన కురుస్తూంటే. ఏమి టిలా కొట్టుకొచ్చేవు...' మూర్తి కుర్చీలో కూలబడ్డాడు.

'ఏం చెయ్యడం బాబూ. నువ్వు నెయ్యికాళ్ళ జెట్టివి. గోవింద ద్వాదశిలా నీ దర్శనమే దుర్లభం!'

'మంచివాడివే! నే నేవూరూ వెళ్ళిపోలేదే. పైగా పనీ, పాటా లేదాయె...!'

'అవు నేం వుద్యోగం వదిలేశావుట! మొన్న మీ హెడ్ గుమాస్తా వచ్చాడు మా ఆఫీసుకు. చెప్పాడు. నే చెప్తా, మళ్ళీ జాయినైపోరాదూ!'

'ఉద్యోగం చెయ్యడానికి వోపిక లేదు మూర్తీ!'

'మంచివాడివే! ఉద్యోగం చెయ్యడానికి వోపిక లేదు. బొమ్మ వెయ్యడానికి వోపిక లేదు. ఎలాగయ్యా నీతో! ఏదీ ఒక సిగరెట్టు పారీ...' కాశీ పెట్టె చూపించాడు ... 'కానీకి రెండు మచ్చు ...' నవ్వుతూ అన్నాడు. మూర్తి వెంటనే నరాలుబ్బేలా నవ్వుతూ అన్నాడు...'రాయల్ బ్రాండోయ్! నాకూ అదే యిష్టం ...' అంటూ వొకటి తీసుకొని ముట్టించేడు.

మూర్తి తను లక్షాధికారినన్న సంగతి తరుచు మరచి పోతూంటాడు. ఇచ్చేటప్పుడు కావాలని మర్చిపోతాడు.

పుచ్చుకునేటప్పుడు నిజంగానే మర్చిపోతాడు. బ్యాంకి బ్యాలెన్సు బ్యాంకిదే. తన బ్యాలెన్సు నిల్లు. ఇది అతని జీవిత సూత్రం. తన బ్యాంకి బ్యాలెన్సును పెంచడం తనకు నూరు మంది అనాథల్ని పోషించినంత ఆనందం యిస్తుంది.

తనకు రెండు సినిమా థియేటర్లు, ఒక మ్యూజికల్ స్టోర్సు వున్నాయి. ఇటీవలే సినిమా డిస్ట్రిబ్యూషన్‌లో భాగస్వామి అయేడు. ఇవేవీ తనవి కానట్టే వుంటాడు. తామరాకు మీద నీటిబొట్టు. అతని పనివాళ్ళకు జీతాలు గోర్రెతోకలు. పని ఆంజనేయుడి తోకలు. అతడికి 'ప్రెస్' వాళ్ళన్నా, రచయితలన్నా కిట్టదు. కాని తన వునికి వాళ్ళ వునికిమీదే ఆధారపడ్డదని అతనికి గట్టిగా తెలుసు. అందుకే అత చెప్పినా వుబ్బి నవ్వుతూంటాడు.

శంఖం వూదినట్టొక దమ్ములాగి సిగరెట్టు నుసి దులిపి అన్నాడు —

'చూడు కాశీ! ప్రస్తుతం వొక అర్జంటు పనిమీద వచ్చా...!' కాశీ ఏమిటో అన్నట్టు కనుబొమలెత్తేడు.

'చలాకీపిల్ల, రౌడీరాణి మొదలైన అరడజను స్టంట్లూ పౌరాణికాలూ వస్తున్నాయి. వాటికి బ్రహ్మాండమైన 'కటవుట్'లు తయారుచెయ్యాలి...'

హఠాత్తుగా కాశీ కడుపులో ఆకలి రగిలింది.

'నీ కిది గొప్ప అవకాశమోయ్ కాశీ... నీ పేరు మారుమోగిపోతుంది! ఇదిగో ఐదురూపాయలు ముందుగా ఖర్చుకి...'

కాశీ నోటు స్వీకరించలేదు. అది పుచ్చుకోడంలో వున్న ప్రమాదం అత డెరుగును.

'మూర్తీ నన్నెందు కిబ్బంది పెడతావు. మరెవ్వరినైనా పురమాయించు యీ పనికి...'

'అమ్మమ్మా...అలా అనకు. అసలీ పని నువ్వుతప్ప మరెవ్వరూ చెయ్యలేరు. నన్నడుగు. మా కర్మంగాని, భగవంతుడు నీకు స్థిరత్వం యిచ్చాడుకాడు. అంతే. పద మా ఆఫీసుకు. రాత్రి మా యింట్లో భోంచేదువుగాని...మరి లే!'

భోజనం పేరు వినగానే కాశీ కడుపులో ఆకలి జ్వాలలు రేగింది. వెంటనే లేచేడు. ఇద్దరూ గొడుగులో తడుస్తూ వెళ్లేరు.

# 11

'కాశీ కనుపించడం లేదు. నెలపైగా అయింది. మీ యింటి కొస్తున్నాడా?' డాక్టరు ప్రశ్నించేడు కృష్ణయ్యని ఆదివారం వుదయం కాకతాళీయంగా డాక్టరు, మూర్తి, కృష్ణయ్య హోటలులో కలిసేరు. అప్పుడు కృష్ణయ్య స్వయంగా కలెక్షను దగ్గరవున్నాడు వీళ్లని చూడగానే కవుంటర్ దగ్గర మరొకడిని కూచోపెట్టి వచ్చాడు.

'Come on! Let's go inside.... లోపలికి పదండి. ఇక్కడంతా గొల్లగావుంది...'



'ఎక్కడైతేనేం యిక్కడే కానీ...గొల్లగావుంటేనే నీ గల్లా పెట్టె నిండుతుంది...' డాక్టరు.

'అవునండీ డాక్టరుగారూ, మా బిజినెస్ మెన్లని చూస్తే మీకెలా వుంటుంది. మేమంతాకూడా మీకంటికి రోగుల్లాగే కనిపిస్తామా...' మూర్తి, అని తనమట్టుకు తనే నవ్వుకున్నాడు.

'మమ్మాటికీ తెలుగురోగులు ఇంగ్లీషు రోగులుకూడా,' మూర్తికి ఆ ధ్వని అర్థంకాలేదు. కృష్ణయ్య కొంచం నొచ్చుకున్నాడు. "See see .... these doctors .... he is calling us rogues ...."

అంతా నవ్వుకుని లేచి లోపల కృష్ణయ్య ప్రైవేట్ గదిలోకి వెళ్ళారు. అక్కడ బాతాఖానీలో కాశీ ప్రమేయం వచ్చి డాక్టరు ప్రశ్నించేడు. కాశీ పేరు వినగానే కృష్ణయ్యకు ఆ కంఠం కోపం వచ్చింది. అతి హేయభావంతో అన్నాడు.

'కాశీ! కాశీ! అతడు రెండు నెలలైనా కనుపించలేదు. He deceived me. అతను నన్ను మోసం చేసేడు. నా కొత్త హోటలు కన్‌స్ట్రక్షన్లో help చేస్తానన్నాడు ... నమ్మించి చిగొంతుకోశాడు.'

'డాక్టరుగారూ చెపితే నమ్మండి. నెలక్రితం వోనాడు మా ఆఫీసుకు నాతోకూడ వచ్చాడండీ. నేను కొన్ని 'కంట్రాక్టు' చెయ్యమన్నా. నాటినుండి నేటివరకు మొహం చూపించలేదు. అతడిని నమ్మినవాడు బుడుంగున మునిగిపోయేటన్న మాటే. నేనొక పదిరూపాయ లివ్వబోయా. అదృష్టవశాత్తు పుచ్చుకోలేదు గాని ...



"Ten Rupees .... అదొక లెక్కా. నేనూ నా వైఫూ ఎంతో యిచ్చాం. నాకంటె నా పెండ్లాం ఎంతో యిచ్చింది. But he is not to be believed........"

వీళ్ళిద్దరూ యిలా డబ్బుకోసం లబో దిబోమని మొత్తు కుంటున్నాను డాక్టరు ఆలోచన వేరుగా వుంది. ఆ గది దక్షిణ దిక్కు కిటికీ కవతల సందు వుంది. అక్కడే హోటలు యెంగి లాకులన్నీ పారేస్తారు. ఆ యెంగిలాకులకోసం ఒక అరడజను ఊరకుక్కలు అక్కడ చేరి కాట్లాడుకుంటూ బొంయి బొంయి మని మొరుగుతున్నాయి.

వాళ్ళిద్దరూ వూరుకున్నాక డాక్టరు అన్నాడు: 'మీ రిద్దరూ ఐదు పోయింది, పది పోయింది అని చస్తున్నారుగాని అసలుగుట్టు యెరగరు. ఆ రాఘవేంద్రరావుగారి కూతురు ప్రభవుంది చూశారూ!...వీళ్లిద్దరి వ్యవహారం రసకందాయం లోకి దిగుతున్నట్టుంది....'

వెంటనే కృష్ణయ్యకు యేదో స్ఫురించినట్టయింది. 'ప్రభ! ప్రభ! O! yes! ఆ వేళ మీ అమ్మాయి డాన్స్ చేసిన నాడు రాత్రి స్టేజిమీద మీరు పరిచయం చేశారు... ఆ పిల్ల...'

డాక్టరు ఔనని తలవూపేడు.

'Yes! Yes! నిన్న నేను చూశా! రాత్రి పది గంట లకు. Harbour park down కు మలుపు తిరుగుతూం టే, ఆ పిల్ల... Exactly like కాశీ... Old man కూడా వున్నాడు. వెన్నెల షికారు చేస్తున్నారు.'

'రాత్రి పది గంటలకు!' డాక్టర్ ఆశ్చర్యపోయేడు.



సరిగా ఆ దేసమయానికి హెడ్ గుమాస్తాకూడా అక్కడికే వచ్చేడు. హెడ్ గుమాస్తాకు హోటలువాళ్ళతో, సినీమావాళ్ళతో, బస్సుల వాళ్ళతో చాలా పరిచయం. ఎక్కడా ఓ కానీ యివ్వకుండా అన్ని సదుపాయాలూ శ్రీరామచంద్రుడి పేరుచెప్పి చేసుకుంటాడు.

'ఎవరు కాశీవా. అతనిని నమ్మినవాడు నట్టేట్లో కలిసి పోవలసిందే...శ్రీరామచంద్రా...మా తండ్రిగారి తైలచిత్రం వ్రాయమని మూడేళ్ళ క్రిందట బ్రతిమాలా. ఉద్యోగం మానేశాడుగాని చిత్రం వ్రాయలేదు.

'నమ్మకూడదతన్ని ...' మూర్తి.

'దగాకోర్' కృష్ణయ్య.

'నమ్మకండి బాబోయ్' హెడ్‌గుమాస్తా.

## 12

ఆవాళ మధ్యాహ్నం పన్నెండు గంటలకు కాశీ రావుగారింటికి వెళ్ళేడు. అప్పుడు ప్రభ స్టూడియో గదిలో వుంది. రావుగారు చావడిలో ఏదో వ్రాసుకుంటున్నారు. కాశీని కుశల ప్రశ్నలు వేసేరు. తరవాత ప్రభ స్టూడియో గదిలో వుందని తెలుసుకుని అక్కడకు వెళ్ళేడు.

ప్రభ చిత్రలేఖనంలో మునిగిపోయింది. ఉప్పొంగుతూన్న సముద్రంలో వెన్నెలకాంతులు చిత్రిస్తూంది. ఉండుండి సందేహంతో ఆమె చెయ్యి ఆగిపోతూంది.



'అలా పెన్సిల్ గీతలు పెట్టుకుంటే లాభంలేదు ప్రభా.' ప్రభ తెల్లబోయి 'మీా రెప్పుడు వచ్చా'రన్నట్టు తిరిగిచూసి 'క్షమించండీ' అంది.

'ఈ గీతలు రైలుపట్టీల వంటివి. వాటిని ఆధారం చేసుకుంటే చిత్రం రైలు ప్రయాణంలాగే వుంటుంది. తిరిగి తిరిగి అవే కొండలు, చెట్లు. స్టేషన్లు...కాశీ.

'అబ్బే. ఆ రేఖలు సూచనప్రాయంగా పెట్టుకున్నా. అంతే...' ప్రభ.

'అలాకాదు. పని కుంచతోనే ప్రారంభించాలి. అతి సన్నని రేఖలుకూడా కుంచతోనే వ్రాయాలి. వర్ణసమ్మేళనం, రేఖా సమ్మేళనం - వీటిని బాగా అవగాహన చేసుకోవాలి.

షాజహాన్ చక్రవర్తి తన హృదయేశ్వరి ముంతాజ్ జ్ఞాపకార్థం వొక విశేషమైన కళానిర్మాణం చేయిద్దామనుకున్నాడు. కాని, యెంత ఆలోచించినా అదేదో అతనికి స్ఫురించలేదు. ఎంతమంది కళారాధకులను అడిగినా యెవ్వరూ చెప్పలేకపోయేరు.

ఈలోగా ఇరాన్‌నుండి వొక శిల్పి వచ్చాడు. అతడు షాజహాన్ అంతఃపురంలో వుండే 'రూహీ' అనే అపురూప సుందరిని గాఢంగా ప్రేమించాడు. ఆమె ప్రేమలో సురుచిర స్వప్నాలుకంటున్నాళ్లూ అతడు కూడా చక్రవర్తి కోర్కె తీర్చలేకపోయేడు. కొన్నాళ్ళకు రూహీ చనిపోయిందని వదంతి పుట్టింది. ఆ వార్త వినగానే, శిల్పిహృదయం అతడి చేతులలో పగిలే రాళ్ళవలె బ్రద్దలైంది. ఆ అనంత శోకంలోనే అతడు షాజహాన్ హృదయ పరితాపాన్ని అర్థం చేసుకోగలిగేడు.

అప్పుడే అతని హృదయంలో మెరిసింది కాలాన్ని ధిక్కరించిన కళాఖండం 'తాజ్‌మహల్'. ఉద్రేకపూరితంగా చేసినదే నిజమైన 'కళాశిల్పం' కాశీ.

'నిజమే, కాని వుద్రేకం రావాలి. పిలవగానే రాని వుద్రేకం యజమాని పిలవగానే రాని కుక్క వంటిదట.' రావు గారు.

అంతా ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. ప్రభ కొంచెం సిగ్గుపడి తనకు నైపుణ్యం తక్కువన్నట్లు 'పరిపూర్ణ శాస్త్ర పరిచయం కావాలి కదా వొక కళాఖండం నిర్మించడానికి' అంది.

'నిజమే. కాని శాస్త్రం ముగిసిన దగ్గర కళానిర్మాణం ఆరంభం ఔతుందన్నాడు టాల్‌స్టాయ్. కేవల పండితుడు పాలరాతి గుట్టలవంటివాడు. కళాకారుడు తాజ్‌మహల్ వంటివాడు. అధ్యయనంకూడా వొకకళే. దానిద్వారా కళాపిపాసువు యితరుల మేధాసంపత్తిని సంగ్రహిస్తాడు' కాశీ.

'మీ మాటలవల్ల నాకు కొంచెం ధైర్యం కలుగుతూంది. నాకు యే చిత్రం చూసినా దానిలోని ప్రతిభావంతమైన హంశాన్ని అనుకరించాలని వుంటుంది. పైగా అదినాదే అనిపిస్తుంది. కాని వెంటనే నా అశక్తి నన్ను కుంగదీస్తుంది' ప్రభ.

'కుంగిపోవలసిన అవసరంలేదు. ప్రభా అలా యితరుల గొప్పని అభినందించేశక్తి యెంతమంది కుంటుందని? ఒకరి కళను అభినందించడం తన కళను పెంపొందించడానికి దారి తీస్తుంది....' కాశీ.



ఇంతలో రావుగారన్నారు, 'విచక్షణా జ్ఞానంద్వారా కళాధ్యయనం చెయ్యాలన్నాడు అరిస్టాటిల్. ప్రకృతిని గమనించి పరిశోధించాలి. ప్రభా నువ్వు రాస్తూన్న బొమ్మ అలా ఆపు. ఇవాళ పౌర్ణమి. రాత్రి భోంచేసి వాల్తేరు అప్లాండ్సు కెడ దాము. కాశీ నువ్వుకూడా యిక్కడే భోంచెయ్యి. పదండి చావడిలోకి. ఇక్కడ రంగుల వాసనకుతోడు వుక్కకూడా జాస్తీగావుంది' రావుగారు.

సంజపడ్డాక జయపూర్ రాజావారి 'హవామహల్' దగ్గరనుండీ ఆ కొసకు వెళ్ళేవరకూగల సముద్రతీరం స్వాప్నిక జగత్తులా వుంటుంది. వెన్నెల్లో యెఱ్ఱమట్టిదిబ్బలమీద, వాటి మధ్య చరియల్లో భగ్నహృదయాలు వూగిసలాడుతూన్నట్టుం టుంది. అక్కడ వీచే గాలిలో ఆవేదన, అలలు పరిషేచనం చేస్తూన్న బండలదగ్గర యేవో పూర్వజన్మ స్మృతులు బరు వుగా కదులుతూంటాయి. సముద్రానికెదురుగావున్న కొబ్బరి తోటలలో యెవరో మతిపోయి సంచరిస్తూన్నట్టుంటుంది.

ఆ వెన్నెలలో, మత్తెక్కిన ప్రకృతిలో ఆనందంతో లాస్యంచేస్తూన్న సముద్రాన్ని చూస్తూ రావుగారు, ప్రభ, కాశీ కాలం ఆగిపోయిందనుకొని విహరించేరు.

పదిగంటలకు క్లబ్బునుంచి కారులో వెడిపోతూ హోటల్ ప్రొప్రయిటర్ కృష్ణయ్య వాళ్ళని చూశాడు. ఆ విషయమే హోటలులో డాక్టరుతో చెప్పేడు.

వాళ్ళు ముగ్గురూ యింటికి వచ్చేసరికి సుమారు పన్నెండైంది. రావుగారు తమగదిలో పడుకున్నారు. కాశీ

వీధి చావడిలో సోఫామీద పడుకున్నాడు. ప్రభ తనగదిలోకి వెళిపోయింది.

కాశీ సోఫాలో వెల్లకిలా పడుకుని సిగరెట్టు పీలుస్తూ ఆలోచిస్తున్నాడు. ప్రభ వెన్నెలలో దేవతలా వుంది. ఆమె కళ్ళలోని యౌవనకాంతి వెన్నెలవల్ల శతాధికంగా మెరిసింది. స్ఫటిక మణివలె స్వప్రకాశమైన ప్రభ, ఆ విరగ్గాచే వెన్నెలలో పూజింపదగినదిగా వుంది.

సృష్టిలో శ్రేష్ఠతమమైన ప్రతీదీ నేనే అని భగవంతుడు గీతలో చెప్పేడు. దానిలో సత్యం కాశీ కిప్పుడు బోధపడింది.

కాశీ డాబామీదకు వెళ్ళి వెన్నెలలో పచారు చేస్తున్నాడు. ప్రభ తనని ప్రేమిస్తూంది. అందుకు సందేహం లేదు. ఒకటి రెండు సందర్భాలలో ఆ విషయం సూచించిందికూడా! ఇంకా తను జంకడంలో అర్థం లేదనుకున్నాడు. వెంటనే క్రిందకువెళ్ళి కర్టన్ తొలగించి గదిలోకి వెళ్ళేడు. ప్రభ నిద్రపోతూంది. మూతలుపడిన ఆమె విశాల నేత్రాలు సౌందర్య ధనరాసులు గల ఆమె హృదయ మందిరానికి దారితీసే ద్వారాలలా వున్నాయి.

కాని ఆ కనుబొమలు సన్నంగా, పొడవుగా, సరిగ్గా వంపుతిరిగి ద్వార రక్షణచేసే నల్లత్రాచులలా వున్నాయి. పగడపురంగు కలిగిన ఆమె క్రింది పెదవి కొంచెం వణకుతూంది. దంతపు బంతులవలె ఆమె హృదయసీమ నిదానంగా లేచిపడుతూంది. కాశీకి భయం వేసింది. గుండె దడదడ కొట్టుకుంది. కాళ్ళు వణికేయి.



ఒక సమున్నత సౌధంలో పోతుటీగకైనా జొరరాని అంతఃపురంలో, విశాల శయనాగారంలో, బంగారు పందిరి మంచంమీద పవ్వళించిన రాజకుమారి ఆమె! తనో? ఆమె సౌధపు ప్రహరీగోడ కవతల, దిక్కు తెలియక తిరుగులాడే వూరకుక్క. ఎంత సాహసం తనా మెను ప్రేమించడం! ఎంత గుండెతీసిన పని, తనారాత్రి ఆమె వొంటరిగా పడుకున్న గది లోకి వెళ్ళడం! ఆమెకు తెలివివస్తే? ఆమె తండ్రి చూస్తే? మెడమీద చెయ్యివేసి యెత్తైన వీధి అరుగుమీంచి రోడ్డుమీద బోర్లా పడేలా వొక తోపు తోసేస్తారు.

అతడు ఆపాదమస్తకం కంపించేడు. వణకే కాళ్ళతో, చెమటతో తిరిగి డాబామీదకు పాకుతూ వెళ్ళేడు. ఆకాశంకేసి దీనంగా చూసేడు.

దూరంగా పిలుపు వినిపిస్తూంది. అవిగో జ్వాలా కేశాలు. కణకణమండే జ్వాలానయనాలు. జ్వాలికామాలికల హస్తాలు చాచి, కీస మంటలవంటి వ్రేళ్ళువంచి, జ్వాలాకంఠంలో 'రా' అనే పిలుపు. కాశీ నిలువునా కూలిపోయేడు.

# 13

'టింగ్ టింగ్...టింగ్ టింగ్...బాబూ, తప్పుకో!' సైకిల్ రిక్షాలు...

'పూంవాంయ్...పప్పాం!' బస్సులు, కార్లు... సాధ్యమైనంత తప్పుకునే నడుస్తున్నాడు కాశీ. కాని, ఆలోచిస్తూ నడవడం అతనికి కుదరని రోగం.



'రోడ్డుమధ్య నడవకండీ... వారంట నడవండీ... కార్ల కింద, బస్సులకింద పడితే బతకరు. వారం టే వారం టే నడవండీ! లారీలకింద పడితే చచ్చిపోతారు...' పోలీసులారీ.

'మెరె దిల్ నె పుకారె ఆజా... కుంభకర్ణా వారి 'జఠరాగ్ని' సాటిలేని చిత్రం. ఈ రోజే విడుదల. శనివారం మధ్యాహ్నం మూడుగంటలకు మ్యాటినీ. ఆదివారం వుదయం తొమ్మిది గంటలకు, ఒంటిగంటకు ప్రత్యేక షోలు. తొలివారం ప్యాసులు చెల్లనేరవు. కుంభకర్ణా వారి జఠ... 'మేరె గమ్‌కె సహారే ఆజా'...' సినీమా వేన్.

హెచ్చరికలు... హెచ్చరికలు... ఈ హెచ్చరికల మేరకు సాధ్యమైనంతవరకూ కాశీ నడుచుకుంటూనే వున్నాడు. కాని, ఆలోచిస్తూనే నడుస్తున్నాడు.

ఇంకా యింకా... అందముగా క్రాపులు కత్తిరించబడును...

'Step in for the shoes of your choice....'

'పండ్లు కట్టబడును...' '... బీడీలనే కాల్చండి... హెచ్చరికలు... హెచ్చరిక... 'పరాకుగా నడుస్తున్నాడు...'

'మీరు ఆస్తమాతో బాధపడుతున్నారా?'

'మీకు చిడుం పట్టుకుందా...? మీ తలకాయమీద వెంట్రుకలూడిపడి పోతున్నాయా... రోమరాజ్యాశ్రమంవారి కోడిపెట్టమార్కు తలనూనెనే వాడండి...' రేడియో... హెచ్చరికలు.

మానవుడు తనబహుపరాక్ తనెరుగును. అందుకే తనకు హెచ్చరించడానికి యెన్నెన్ని మార్గాలో కనిపెట్టుకు జాగ్ర



త్తగా వాడుకుంటున్నాడు. వార్తా పత్రికలద్వారా, రేడియో ద్వారా, చప్పుళ్ళద్వారా, సైనుబోర్డులద్వారా తనకు కావలసినవి తెలియజేస్తున్నాడు, తెలుసుకుంటున్నాడు. దూరంగా, యింకా దూరంగా వున్నవాళ్ళకు వినిపించేందుకు భగవంతుడిచ్చిన గొంతు చాలక బాకా పెట్టుకుని అరుస్తున్నాడు. అణువు డొక్క చీల్చి, ఆకాశాన్ని పరిశోధించి కాలాన్నీ, దూరాన్నీ కళ్ళేలతో బిగించి స్వారీ చేస్తున్నాడు మానవుడు. తన గొంతుకను పదివేలరెట్లు పెంచే 'మైక్' తయారు చేసుకున్నాడు. ఈ రావణా మైక్ల గోలలో అతడికి ఆత్మ ప్రబోధం వినిపించలేదంటే ఆశ్చర్యమేముంది.

కాని మానవుడు గుసగుసలతో కొంప లంటించే విద్యలో కూడా ఆరితేరినవాడే. ఇక్కడ శబ్దం వుండదు. సైనుబోర్డు వుండదు. గప్‌చుప్. కాని అపవాదులు, నీ నీలాపనిందలు స్కాండల్సు రేడియోకంటె వేగంగా, జిగితంగా ప్రసారిస్తాడు.

హోటల్ ప్రొప్రయిటర్ కృష్ణయ్య, పత్రికాధిపతి మూర్తి, డాక్టర్‌రాజు, హెడ్‌గుమాస్తా యిదేపని పెట్టుకున్నారు. ఈ ప్రచారంలో వసంత నెనుదియ్యలేదు. కాశీ, ప్రభల పేర్లు జంటచేసి, అబద్ధాలు వంటచేసి, యింటింటా పంచి పెడుతున్నారు. కాశీ అసలే పిరికివాడు. అందులో తనమీద యిలాంటి స్కాండల్సు పుడితే హడిలిపోతాడు. అతడే గడపా తొక్కలేకపోయేడు. చివరకు రావుగారింటికి కూడా వెళ్ళలేదు. అప్పుడు అనుకున్నాడు తన వుద్యోగానికి రాజీనామా యివ్వడం అంత ఆలోచించి చేసినది కాదేమోనని. వెంటనే వుద్యోగం చెయ్యాలని బుద్ధి పుట్టింది. ఒక

సిల్కుస్టోర్సు ప్రొప్రయిటరు 'సేల్సుమన్' పని యిస్తానన్నాడు. అక్కడికే బయల్దేరి వెడుతున్నాడు. వెడుతూంటేనే యీ ఆలోచనలన్నీ కలిగాయి.

'ప్యారిస్ సిల్క్ ఎంపోరియం' అని యింగ్లీషులో పెద్ద సైన్‌బోర్డు వుంది. ఎంపోరియం గడప కిరుప్రక్కలా సినిమా తారలవంటి నాగరికతగల స్త్రీ బొమ్మలున్నాయి.

కాశీని చూడగానే ప్రొప్రయిటర్ చాంద్ చిరునవ్వు నవ్వేడు. 'హలో మిస్టర్ కాశీ – రే పుదయంనుంచే జాయి నైపో' అన్నాడు. కాశీ అలాగే అన్నాడు. కాశీకి శుభ్రమైన బట్టలు లేవు. మొహమాటపడితే దొరకబోయే వుద్యోగం ఎగిరిపోతుంది. ఎలాగో నీళ్లు నములుతూ చెప్పేడు. చాంద్ చలించకుండా మందహాసం చేశాడు.

'నాదగ్గర నీకు సరిపడే రడీమేడ్ సూటుంది. రా వుదయం'. కాశీ వుద్యోగంలో ప్రవేశించి పదిరోజులైంది. పని హుషారుగా చేస్తున్నాడు. షెల్ఫులలోంచి తాన్లు తీస్తున్నాడు. బల్లలమీద పెడుతున్నాడు. తిరిగి యథాస్థానంలో వుంచు తున్నాడు ఉదయం యేడుగంటలనుండీ రాత్రి తొమ్మిది గంటలవరకూ బట్టలషాపే బ్రతుకు. చివరకు అతని జీవితం గజంబద్ద కొలకి దొరికిపోయింది.

నెల తిరిగి పోయింది. షావువాడు డెబ్బైరూపాయ లిచ్చాడు. అందులో సగం హోటలుకు పోయింది.

రెండో నెల మొదటివారంలో ప్రొప్రైటర్ యింటికి సున్నాలు వేయించాడు. కిటికీలకు రంగులు వెయ్యాలి. సాయంత్రం వెడిపోతున్నప్పుడూ చాంద్ పిలిచాడు.



'మిస్టర్ కాశీ నువ్వు పేద్ద ఆర్టిస్టువికదా. నాకో సాయం చెయ్యకూడదూ. మాయింటిలో కిటికీలకూ, ద్వారబంధాలకూ పెయింటింగ్ చెయ్యాలి. రేపటినుండీ నువ్వా పనిచేసిపెడుదూ. ఆ పని పూర్తి అయేవరకు షాపుకు రానక్కరలేదు. భోజనం యేర్పాటుకూడా నేనే చేస్తాను...'

కాశీకి కొరడాతో కొట్టినట్లయింది. కాని పస్తా యించేడు. రోషపడితే వుద్యోగం పోతుంది. సరే ఏపనైతేనేం అలాగే అన్నాడు.

చాంద్ యిల్లు ఎంపోరియం వెనకవెంపుంది. ఆ యింటికి వీధిగుమ్మం అవతల వీధిలోకుంది. మర్నాడుదయం కాశీ వెళ్ళేసరికి చాంద్ యింట్లోనే వున్నాడు. షాపుకు అప్పుడే బయల్దేరబోతున్నాడు. కాశీకి ద్వారబంధాలు, కిటికీలు, వాసాలు, యింకా యింకా బల్లలు, కుర్చీలు చాలా పురమా యించేడు. పని ఆరంభించమని చెప్పి వెళ్ళిపోయేడు.

వీధివెంపు ద్వారాలకూ, కిటికీలకూ ముందు ఆరం భించేడు. 'ఆలివ్ ఆకుపచ్చ' వసంతశోభలా తళతళ మెరుస్తూంది.

చాంద్ భార్య పెయింటింగు చాలా మెచ్చుకొని ఆ విషయం భర్తతో చెప్పింది. అతడు షాపులో సేల్సుమన్‌గా పనిచేస్తున్నాడని మాత్రం చాంద్ చెప్పేడు.

మర్నాడు కాశీ పెయింటింగు ఆరంభించబోతున్నాడు. బంట్రోతు వచ్చి 'బాబూ, లోపలగదుల్లో రంగు వెయ్యాల ఓట. అమ్మగోరు సెపుతున్నారు' అన్నాడు.



బంట్రోతు దారిచూపిస్తూంటే కాశీ లోపలకు వెళ్ళేడు. పడకగదికి యెదురుగావున్న గదిలో కిటికీలకు రంగువేసి గుమ్మానికి వెయ్యబోతున్నాడు. సుమారు పదకొండౌతుంది.

'ఎదురు గదిలోవున్న చాంద్ భార్య కిటికీ తెరలోంచి తొంగి చూసింది. వెంటనే పోల్చింది. మరొక పదినిముషాలు పోయేకా బంట్రోతువచ్చి కాశీతో అన్నాడు 'అమ్మగారు నోపలి చావిడిలో వున్నారు. రమ్మంటున్నారు'.

ఆ రంగుచేతులతోటే కాశీ వెళ్ళేడు. విశాలమైన చావడి. దానిమధ్య వొక గుండ్రబల్ల, కుర్చీలు వున్నాయి. బల్లమీద టీ వుంది. చావడిమీద గది ద్వారానికి సిల్కు తెర వ్రేలాడుతూంది. కాశీ దిక్కులు చూస్తున్నాడు.

'టీ పుచ్చుకోండి' స్త్రీకంఠం ఇంగ్లీషులో. 'అగుపించని పంజరంలోని రామచిలుక వుండుండి మాట్లాడుతూంటే యెలా వుంటుంది'. కాశీ అలాగే ఆశ్చర్యపోతున్నాడు.

'అప్పన్నా! నువ్వువెళ్ళి పనిచూసుకో....' అప్పన్న వెళ్ళిపోయేడు. తెర తొలగింది. చాంద్ భార్య కాంతిమతి. కాశీ కొంచెం గాభరాపడ్డాడు. కాని వెంటనే సర్దుకుని ఆమె నైపు తదేకదృష్టితో చూస్తున్నాడు.

కాంతిమతి సింధీయువతి. ఒడ్డూ, పొడుగూ గలిగి ఉప్పెనలా పొంగిన యౌవనం గలది. గులాబీరంగు శరీరం. విశాల వదనం. విశాల నేత్రాలు.

'డాక్టర్ రాజుగారి అమ్మాయి నృత్యం చేసినప్పుడు మీ సెట్టింగులు చాలా బాగున్నాయి. అప్పుడు మిమ్మల్ని



స్టేజిమీద చూశా... మీరు చాలా మహాత్ములు. క్షమించండి... టీ తీసుకోండి... !'

ఆమె నించోనే అలా చాలా బాతాఖానీ చేసింది. ఆ మధ్యాహ్నంకూడా అలాగే గడిచిపోయింది. అసలుపని కాలేదు. మధ్యాహ్నంనుంచీ యెదురు కుర్చీలలో కూచుని యిద్దరూ బాతాఖానీ చేసేరు. కాంతిమతి తన బొమ్మను పెయింటు చెయ్యమని కోర్కె వెలిబుచ్చింది. కాశీ అలాగే అన్నాడు.

ఈ ప్రకారం మూడు రోజులు మూడు నిముషాలలా వెళిపోయేయి. బట్టలషాపుకు యెంతోమంది స్త్రీలు వచ్చేవారు. వారిలో నిజంగా మిక్కిలి అందంగా వున్నవారుకూడా వుండేవారు. కాని వారి శరీరసౌష్టవాన్ని పరీక్షగా చూడడానికి అవకాశ మెక్కడ? రెండో యెక్కంలాంటి ఆ జీవితానికీ, సౌందర్యోపాసనకూ సగం యెరిక.

ఇప్పుడు అనుకోకుండా కాంతిమతి తన గానుగ జీవితానికి స్వేచ్ఛయిచ్చి గంతలు విప్పింది. కాని తా నొకటి తలుస్తే, దైవ మొకటి తలుస్తాడు.

నాలుగో రోజుదయం చాంద్ కాశీని షాపుకు పిలిచాడు. అణాపైసలతో అతని కివ్వవలసింది యిచ్చి 'భాయీ! Excuse me! నా బిజినెస్ యేమంత బాగా లేదు. నువ్వు మరెక్కడైనా పనిచూసుకో. దేవుడు నీకు మేలుచేయుగాక !' అని దీవించి పంపేడు. మధ్యాహ్నం చాంద్‌భార్య కాశీ యేడని అడిగింది. అతడి చెల్లెలు చచ్చిపోయిందని టెలిగ్రాం వచ్చింది. వెళ్ళిపోయాడని చెప్పాడు.



చాంద్ చెప్పినదానికి కాశీ జవాబు చెప్పలేదు; బతిమాలలేదు. డబ్బు జేబులో పెట్టుకుని వెనుదిరిగేడు. తిరిగి వీధిలో పడ్డాడు. డబ్బున్నాళ్ళు రెండుపూటలా తిన్నాడు. డబ్బైన్నాళ్ళొంటుంది. మూడురోజుల తరువాతనుంచీ తన పరిస్థితి యథాప్రకారం అయింది.

తరువాత ఒక ప్రెస్ ఆఫీసులో బైండరుగా పనిచేసేడు. అక్కడ పదిహేను రోజులకంటే యెక్కువ పనిచేయలేదు. ప్రెస్ ప్రొప్రైటర్ మరదలు వసంత క్లాసుమేటు. వసంత కాశీని మెచ్చుకుంటున్న రోజుల్లో ఆమెద్వారా కాశీ గురించి యెక్కువగా వింది. తరువాత వసంత నృత్యానికి ముందు నాలుగైదుసార్లు డాక్టరుగారింటికి వచ్చి కాశీని చూసింది.

కాశీ పనిలో ప్రవేశించిన దగ్గరనుండీ తన మరదలు తరుచు షాపులో కొస్తూండడం, కాశీపని మెచ్చుకుంటూండడం, అతనితో మాట్లాడుతూండడం ప్రొప్రైటరుగమనించేడు.

ప్రొప్రైటర్ దూరదృష్టి గలవాడు. వ్యవహారం ముదిరి చచ్చేటంత పరిస్థితి రాకుండానే యీ నాటకానికి భరతవాక్యం పాడాలని నిశ్చయించేడు. పర్యవసానంగా కాశీ తిరిగి నిరుద్యోగి అయి వీధులుపట్టేడు.

కాశీ ప్రెస్ ఆఫీసులోంచి బైటపడేసరికి సుమారు ఆరు గంటలైంది. ఆవాళవరకూ అతనికి రావలసిన పన్నెండున్నర రూపాయలు ముట్టింది.

సంధ్యవెలుగులో తిరిగి టికాణాలేని బ్రతుకుతో మెయిన్‌రోడ్డుమీదుంచి గమ్యస్థానంలేని ప్రయాణంలో పడ్డాడు.

మనుషులు, మోటారుకార్లు, సైకిల్ రిక్షాలు అదేపనిగా తిరుగుతున్నాయి. కొంతదూరం నడిచేసరికి ఎదురుగుండా కృష్ణయ్యకారువస్తుంది. కారు కృష్ణయ్యే నడుపుతున్నాడు. వెంటనే ప్రక్క ఒక కిళ్లీ దుకాణం దగ్గరనించున్న వొకమనిషి ముందుకు తప్పుకున్నాడు. దుకాణం వాడు 'బాబూ యేంకావాలని అడిగేడు.' 'ఏమీ అక్కరలేదు, టైము చూడ్డానికివచ్చా' అని కాశీ గొణిగాడు. ఇంతలో కృష్ణయ్యకారు వెళిపోయింది. కాశీ తిరిగి నడక ఆరంభించేడు. మరికొంతదూరం వెళ్ళేసరికి డాక్టరు రాజు యెదురుగా వస్తున్నాడు. రోడ్డుమీద జనం కిటకిటలాడుతున్నారు. కాశీ ప్రక్కనేవున్న వొక కాఫీహోటలులో దూరాడు. వెళ్ళినందుకు వొకకప్పు కాఫీతాగి బైటపడ్డాడు. అతడికి చెమటలుపోసి పోయేయి.

మరికొంతదూరం వెళ్లేసరికి టవున్ హాల్ రోడ్డు మొదట్లో యెవరితోనో మాట్లాడుతూ హెడ్ గుమాస్తా అగుపించాడు. కాశీ నలుగురు మధ్యగా దొంగలానడిచి అతడినిచుట్టి టవున్ హాలురోడ్డు పట్టుకొని తిన్నగా సముద్రపొడ్డు చేరుకున్నాడు.

సముద్రపొడ్డున స్త్రీలు, పురుషులు, పిల్లలు వుల్లాసంగా కాలంగడుపుతున్నారు. రేడియో లౌడ్ స్పీకర్ లో 'ఈ నవనవాభ్యుదయ విశాలజగతిలో...' సినిమాపాట వినిపిస్తుంది. కాశీ యిసకలో నిలబడి సముద్రం కేసి చూస్తున్నాడు. దూరంనుంచి ముగ్గురు నలుగురు అమ్మాయిలు తనవైపే వొస్తున్నారు. అందులో ఒక అమ్మాయి వసంతలాగే వున్నది. కాశీ అదిరిపడి రెండోవేపు గబగబా నడిచాడు. వాళ్ళింకా తనవైపే వస్తున్నట్టు అనుమానపడి మరీ జోరుగా నడిచాడు.

నడిచి నడిచి నిర్మానుష్యమైన స్థలం చేరేడు. అప్పుడు చీకటి బాగా పడింది. కాని దూరపు దీపాలకాంతి అగు పిస్తూంది. అక్కడ సముద్రానికి చేరువగా బండరాళ్ళున్నాయి. ఒక పెద్ద పణుకుకు అవతలవున్న చిన్న రాతిబండమీద కూచున్నాడు. ఆవాళ సముద్రం విజృంభించినట్లుంది. పెద్ద పెద్ద కెరటాలొచ్చి తీరపురాళ్ళని మోదుతున్నాయి. ఒక కెరటంవచ్చి కాశీని పూర్తిగా ముంచి వెళ్ళింది. అతను తడిసి ముద్దయిపోయేడు.

అలాగే గంటకూచున్నాడు. తలదిమ్మెక్కింది. ప్రపంచం గిరగిర తిరుగుతూందని అప్పుడతనికి బాగా తెలిసింది. మెల్లిగా లేచి కాళ్ళీడ్చుకుంటూ తనగూడు చేరుకున్నాడు.

తనగది పెంటకుప్పలా వుంది. వెడుతూనే దీపం వెలి గించి మంచంమీద మేనువాల్చేడు. అతడికి వెంటనే నిద్ర పట్టింది. నిద్రలో జ్వరం వచ్చింది. ఆ రావటం మూడు రోజులు తీవ్రంగా కాసింది. ఆ మూడు రోజులలో చాలాసార్లు స్పృహ తప్పింది.

ఒక సాయంత్రం యెనిమిది గంటలకు లేచి వీధిలోపడి కాళ్ళీడ్చుకుంటూ నడిచాడు. కష్టంమీద మఱ్ఱిచెట్టుక్రింద పైడమ్మ కిళ్ళీదుకాణం చేరాడు. పైడమ్మ యెప్పటిలాగే వయ్యారంగా కూర్చుంది. కాశీ వెళ్ళేసరికి దుకాణం దగ్గర ముగ్గురు నలుగురు మనుషు లున్నారు. కాశీని చూడగానే పైడమ్మ నిర్ఘాంతపోయింది. దుకాణం దిగివచ్చి అతడిని చూసి కొయ్యబారిపోయింది. సంగతి అంతా గ్రహించి కళ్ళంట నీళ్ళు



పెట్టుకుంది. అతడికి వెంటనే కావలసింది ఆహారం, విశ్రాంతి అని గ్రహించింది. దుకాణం కెదురుగానే ఆమె పూరిల్లు వుంది. ఇంటివెంపు కాశీని తీసుకెడుతూంటే దుకాణం దగ్గరున్న యిద్దరు ముగ్గురూ కిచకిచ నవ్వుకుంటూ వెళిపోయేరు. పైడమ్మ వాళ్ళకేసి తిరిగి 'ఛూ' అని వుమ్మింది.

పైడమ్మ యిల్లు మట్టిదైనా నీటుగా వుంటుంది. చిన్నదైనా యిమ్ముగా వుంటుంది. కాశీ మొహమాటం పడ్డాడు. గొణిగాడు సణిగాడు. ఆమె 'యేమీ అనవొద్దు, అడగొద్దు, చెప్పొద్దు' అంది.

వెంటనే పడకగదిలో దీపం వెలిగించి పక్క సరిచేసి అతడిని పడుకోబెట్టింది. తెరిచిన దుకాణం తెరిచినట్టే వుంది. వంటింటిలో పొయ్యి రాజేసింది. అరగంటలో వంటచేసి అతడికి భోజనం పెట్టి పడుకోబెట్టి తిరిగి దుకాణానికి వెళ్ళిపోయింది.

కాశీ పడుకోగానే నిద్రపట్టింది. పదకొండు గంటలకు దుకాణం మూసుకొని పైడమ్మ వచ్చి తలుపు చప్పుడుచేస్తుంటే కాశీకి తిరిగి మెళుకువ వచ్చింది. పైడమ్మ భోంచేసి వంటింటిలోనే పడుకుంది. కాశీకి రాత్రి కలత నిద్రగానేవుంది. రెండు మూడుసార్లు ఎవరో తలుపు చప్పుడుచేసినట్లయింది. పైడమ్మ పలకలేదు. ఆఖరిసారి యెవరో తలుపులు మరీ బాదేరు. కాశీ లేదామనుకున్నాడు. కాని పైడమ్మే తిట్టుకుంటూ లేచి తలుపు భడీమని తీసి చీపురుకట్టతో ఆ వచ్చినవాడిని ఛడామడా కొట్టి తలుపు భడీమనివేసి వెళ్ళి పడుకుని మరిరెండు తిట్టుకుని నిద్రపోయింది.

కాశికి వుదయం యెనిమిది గంటలకు తెలివి వచ్చింది. పైడమ్మ వేడినీళ్ళిచ్చింది. స్నానం చేసేసరికి కాశీ [illegible] మామూలుకు వచ్చింది. అతను పోతానన్నాడు. కాని పైడమ్మ వీల్లేదంది. నాలుగురోజులుండి విశ్రాంతి తీసుకొని వెళ్ళిపోమంది.

కాశీ భోంచేస్తూ అడిగాడు 'పైడితల్లి వూరికి వెళ్ళాడా?' వడ్డిస్తూనే పైడమ్మ జవాబు చెప్పింది.

'పరలోకం వెళ్ళేడు.'

కాశీకి తెరిచిననోరు తెరిచినట్లే వుండిపోయింది. చెయ్యి నోటికిపోలేదు.

'అరె...ఎన్నాళ్ళయింది! ఏం జబ్బు!'

'నెలపైగా అయింది. ఏ జబ్బూ లేదు. ఒంటికి తిమ్మిరి జబ్బు పట్టుకుంది. ఆ తిమ్మిరి యెవరోతీర్చి పారేశాడు...' అని పైటచెంగుతో కళ్ళు అద్దుకుంది.

పైడమ్మమీద యెవరో వర్తకుల అబ్బాయి కన్నేశాడని అతడికి అనుమానం పట్టుకుంది. అతడిమీద పగబట్టేడు. రెండు మూడుసార్లు ఆ అబ్బాయిమీద కలియబడి తన్నేడు. ఆ అబ్బాయి యెవడినో పురమాయించి అతడిని నరికించేడు. అదీ కధ.

నామీద కన్నేస్తే తనకేం పోయింది ?

ఎఱ్ఱగా బుఱ్ఱగావున్న ప్రతీవాగిసిన ఆడదానిమీదా ప్రతీమొగోడూ కన్నేస్తాడు. ఇస్వామిత్రుడంతవోడికే తప్ప లేదు ఆ రోగం. కన్నేసినంతమాత్రంలో కందిపోతానా ? ఆడ

దానికిష్టం లేకపోతే దాని నీడనికూడా యే మొగాడూ తాకలేడు. నా మాట యిననేదు, మొత్తుకున్నా కాతరు చెయ్యలేదు. చావొచ్చే యోగం వుంటే బుద్ధులలాగే పోతాయి."

పైడమ్మ మాటలకి కాశీ నివ్వెరపోయేడు. పైడమ్మ చదువుకోలేదు. కాని ఆమె మాటల్లో యెంత యధార్థంవుంది. కాని పైడితల్లి చచ్చిపోయేడు. కొట్టుపక్కని చేతులు కట్టుకొని కీవిగా చిరునవ్వుతో నిలబడేవాడు. కళ్ళకికట్టినట్టే వున్నాడు. అతనికి అల్లాంటి అనుమానం కలుగుతుందని తను కల్లోగూడ అనుకోలేదు. కాని ప్రతీ మానవహృదయం వొక లోకం. దానిలో ఏ కాలానికి వాతావరణం యెలా మారుతుందో యెవరి కెరుక.

మూడు నాలుగు రోజులైంది. కాశీ బాగా కోలుకున్నాడు. సాయంత్రం బాగా పొద్దుగుంకేవరకూ బైటకు రాలేదు. చీకటిపడ్డాక అలా ఓసారి షికారు తిరిగి యెనిమిదింటికి వచ్చేడు. అతడు వచ్చేసరికి పడకగదిలో దీపం వెలుగుతూంది. ఒకమూలనుంచి అగరొత్తుల వాసన గుబాళిస్తోంది. పట్టెమంచంమీద పరుపు పరిచివుంది. మల్లెపువ్వులాంటి దుప్పటీ, పాలనురుగువంటి తలగడ లున్నాయి.

అతను యింటికి రాగానే పైడమ్మ వచ్చి భోజనంపెట్టి పడుకోమని తిరిగి దుకాణానికి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్నప్పుడు చూసేడు, తెల్లని పల్చటి యిస్త్రీ చీరకట్టుకుంది. ఆమె శరీరం గులాబీరంగు, చీరలోంచి చిమ్ముకొస్తోంది. ఆమె విశాల నేత్రాలలో నిత్యానందం తొణికిసలాడుతూంది. ఆమె శరీరం

మీద ప్రతిఫలిస్తూ ఉద్రేకజనకంగా వుంది. అతను తదేకంగా ఆమెవేపు చూస్తూంటే ఆమె అతనికేసి అర్థంలేనట్టు చూసి యెందుకో పకాల్న నవ్వి, వయ్యారపు నడకతో విసవిస వెళ్ళిపోయింది.

యథాప్రకారం ఆమె పదకొండుకు వచ్చి వంటింటిలో మంచం వాల్చుకుని పడుకుంది.

కాశీకి నిద్రపట్టలేదు. లేచి పచారు చేస్తున్నాడు. అగరొత్తుల పరిమళానికి తలదిమ్మెక్కింది. ఒక నిముషం జోరుగా పచారుచేసి పైడమ్మను పిల్చి మంచినీళ్లు కావాలన్నాడు. ఆమె మంచినీళ్ళు యిచ్చింది. అవి నోట్లో పోసుకున్నాడు. కాని దిగలేదు. పొలబారి వుక్కిరి బిక్కిరయ్యాడు.

'నువ్వుకూడ యీ గదిలోనే పడుకోకూడదూ—'

పైడమ్మ అతనికేసి తేరిపారి చూసింది.

'ఔను! ఒక్కడినీ పడుకుంటే తోచటంలేదు. అతడేదో నసిగినట్లున్నాడు. పైడమ్మ నవ్వింది. అతడు పైడమ్మ దగ్గరకొచ్చి ఆమె భుజంమీద చెయ్యివేసి పసివాడిలా అన్నాడు :

'పైడమ్మా! మనసు పరిపరి విధాలపోతూంది. చెప్పలేను నా బాధ. నాకు నీ చేయూత కావాలి. మరీ చేయూత కావాలి'.

వణకుతున్న చేతులతో ఆమెను తనలోకి తీసుకున్నాడు. ఆమె అతడి మొహంకేసి చూస్తూ తన అధీనంలోంచి తప్పిపోయింది.



'నేను మీ కేంమకు బాబూ. నన్నంతా చెడిపోయినది అంటున్నారు' ఆమె గద్గదికతో అంది.

'లేదు. ఈ చెడిపోయిన లోకంలో నీవంటి నిజాయితీ, హృదయంగలవాళ్ళు చాలా తక్కువ. న్యాయస్థానాలలో అబద్ధమాడేవాళ్ళతో, ఆస్పత్రులలో ఖూనీలుచేసేవాళ్ళతో, రసరాజ్యంలో రంకులుకట్టే వాళ్ళతో, చిల్లి కాన్లు దండగుచ్చి మెళ్ళో వేసుకునేవాళ్ళతో, చెప్పాకు మాటలతో, చూపుడు వేళ్ళతో, విరిగిన పెదవులతో, ఒరిగిన ముక్కులతో యీ సమాజపు పటం వైతరిణి నదిలా వుంది. మెరిసే నీ సౌశీల్యాన్ని శంకించేవాళ్ళు, కుళ్ళిపోయిన తమ సౌశీల్యాన్ని పట్టు తెరల వెనక దాచివేశారు!'

అతడంటున్న మాటలు ఆమెకు అర్థంకాక అతడితో శే పక్కవేపు నడిచింది. వాళ్ళిద్దరు తన్మయానంద సామ్రాజ్యపు నాలుగు చెరుగులూ చుట్టి వచ్చేసరికి, వాళ్ళ శరీరాలు పసుగులు తీసిన గుజ్జపు శరీరా లయ్యాయి. వాళ్ళ మధుర నిశ్వాశాలు వొక్కొక్కటి మణుగు తూగుతుంది.



# 14

మరి రెండు రోజులు పైడమ్మ దగ్గరున్నాక కాశీ పూర్తిగా కోలుకున్నాడు. సూర్యం దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. సూర్యం మద్రాస్‌లో పెద్ద ప్రెస్ కొన్నాడు. వెంటనే రమ్మన్నాడు. కాశీకి అనతిదూరాన సుందర భవితవ్యం గోచరించింది. తన ఆకాశ జీవితానికి తన పరిసరాలే కాకుండా తనుకూడా కొంతవరకూ బాధ్యుడేనని గ్రహించేడు. ఆ సాయంత్రం ఆమెకు కృతజ్ఞత చెప్పి బయల్దేరాడు. అతడు వెళ్లిపోతానంటే పైడమ్మ పసిపిల్లలా వెక్కి వెక్కి యేడ్చింది. 'ఎక్కడికి పోతారు బాబూ. మరి నాలుగురోజు లుండండీ. . .'

'చాల్నా పైడమ్మా, నీ మేలు మర్చిపోలేను. కళారాధనలో ఆదర్శజీవిగా బతికేవాళ్ళ జీవితం యెప్పుడూ యెత్తుపల్లాలమయంగా వుంటుంది. నేను దరిచేరరాని జ్వాలా సుందరమూర్తిని ఆరాధిస్తున్నా. నా తపస్సు యింకా ఆరంభ దశలోనే వుంది. ఇంకా సువిశాల ప్రపంచంలోకి వెళ్ళాలి. నా ఆరాధ్యదేవత బృహత్ స్వరూపం నాకింకా లభించలేదు. నా జీవితయాత్ర యింకా కడముట్టలేదు. నాకు తెలుసు. నే నీ తపస్సులో మిడతలా మాడిపోతా.'

ఆమెకు అతడి మాటలు అర్థంకాలేదు. కాని ఆమె డగ్గుత్తికతో అంది: 'బాబూ, నువ్వెక్కడున్నా నా మనసంతా



నీమీదే వుంటుంది. నీ కేప్పుడే యిబ్బంది కలిగినా నా దగ్గర కొచ్చేయి. నా గడప నీకోసం యెప్పుడూ తెరిచే వుంటుంది.'

పైడమ్మ యేడుస్తూంది. తను వ్రాసిన ఆమె బొమ్మ గోడమీద చిరునవ్వు నవ్వుతూంది.

'నీ కోర్కె నా కోర్కె వొకటే పైడమ్మా, నా చివరి గడియలు నీ దగ్గరే గడుపుతా. మరణవేదనలో యెగశ్వాసతో వున్న నా హృదయం మీద నీ చల్లనిచెయ్యి వుంచుకొని నేను శాశ్వతంగా నిద్రిస్తా...'

సంధ్యాకాశంమీద జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూన్న మూర్తికేసి చూస్తూ అతడు నెమ్మదిగా అడుగులేస్తూ దూరపు చీకటిలో కలిసిపోతున్నాడు. ఆమె శిలాప్రతిమలా నిలబడి పోయింది. కన్నీళ్ళు ధారాపాతంగా ఆమె బుగ్గలమీంచి జారిపోతున్నాయి.

సమాప్తం.



